China Sitarama Sastri, Vajjhal, 1878-

కర్ణచరిత్రము

రాజమహేంద్రవరము, 1928

Record no. 467

China Sitarama Sastri, Vajjhal, 1878-

Karṇacaritramu

Rājamahēndravaramu, 1928

Record no. 467

## Bibliographic Record Target

China Sitarama Sastri, Vajjhal, 1878-
కర్ణచరిత్రము / వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిచే విరచితము.-
రాజమహేంద్రవరము : రాజన్ ముద్రాక్షరశాల, 1928.
125 p. ;19 cm.
Record no. 467

China Sitarama Sastri, Vajjhal, 1878-
Karṇacaritramu / Vajjhala Cinasītārāmasvāmiśāstricē viracitamu.-
Rājamahēndravaramu : Rājan Mudrākṣaraśāla, 1928.
125 p. ;19 cm.
Record no. 467

శ్లో. సుధియా పరిపూతమానసౌ
కలయేఽహం జగతః ప్రియంకరౌ
పితరౌ మమ వేంకటాంబికా
ముఖలింగేశ్వరజంపతీ హృది

శ్లో. పితామహభ్రాతృసుతం స్వవిద్యా
గురుం చ చింతామణిసత్సమాఖ్యమ్
శ్రీవత్సగోత్రోద్ధరణప్రశస్తిం
నమామి నారాయణసత్కవీంద్రమ్

# ఉపోద్ఘాతము.



సంస్కృతాంధ్రవాఙ్మయములలో నున్న జనరంజకము లగుకథలలోఁ గర్ణునికథ యొకటి యని చెప్పవచ్చును. భారత వీరులలో మిక్కిలి ప్రసిద్ధి కెక్కి నేఁటికిని సామాన్యజనులకుఁ గూడఁ దెలిసినవీరులు కర్ణార్జునులె. కర్ణార్జునుల తారతమ్యవిషయమున నేఁటికిని లోకము రెండు తెగలయి యున్నది. కొందఱు కర్ణునియందును, మఱికొంద అర్జునునియందును బక్షము గలిగి వాదించుచుండుట సర్వజనులకు విదితమె. ఇట్టిపక్షపాతము చేతనె సంస్కృతమహాభారతమునఁ గర్ణచరిత్రవిషయకములగు కొన్నిభాగములు కొన్నిప్రతులయం దగపడకున్నవి. నన్నయాదులయాంధ్రీకరణమునందును వారికి లభించినమాతృకల వ్యత్యాసముచేఁ గావలయు నిట్టికొఱంత యగపడుచున్నది మహాభారతపాత్రములలోఁ గర్ణుఁడు ప్రధానపాత్ర మగు నటులు "కర్ణుఁడులేని భారతమా! అను సామెతయే విశద పఱుపఁగలదు.

సంస్కృతమహాభారత మర్జునునిసంతతివారి రాజ్యకాలమునఁ బుట్టినట్లగపడుచున్నది ఎప్పుడైనను రాజులయియున్న వారియొక్కయు వారిపూర్వులయొక్కయుఁ జరిత్రములు వ్రాయునపుడు రాజానురోధమున వారివారివిరోధులపరాక్రమములను గొంతవఱకుఁ మఱుఁగుపఱచి చెప్పుటయు నట్టివారిని సమయము దొరకినపుడెల్ల మిక్కిలిగ నిరసించుచుండు

టయుఁ జరిత్రకారులకును సహజమె యని చెప్పవచ్చును. మహాభారతమునందుఁ బాండవుల యరణ్యవాసాదికాలము పదుమూఁడేండ్లును మహాసమర్థుఁ డగుదుర్యోధనుఁడు చేసిన రాజ్యపాలనము మొదలగునవి యంతగా వర్ణింపఁ బడకుండుట నరయఁగా, మహాభారతకవి దుర్యోధనాదులచరిత్రను విపులముగాఁ జెప్పఁదలఁచిన ట్లగపడదు.

చ. "చదివితి నెల్లవేదములు జన్నము లొప్పఁగఁ జేసితిన్ రమా
స్పద మగువృత్తిఁ బొల్చి నరపాలకు లెల్లను గొల్వఁ గంటి దు
ర్మదరిపుగాఢగర్వపరిమర్దనకేళి యొనర్చితిం దగం
దుది నని మిత్రబాంధవులతోఁ ద్రిదివంబున కేఁగు టొప్పదే?"

(భా. శల్య. 2. ఆ. 329 ప).

అని యిట్లు బంధుమిత్రు లెల్లరును యుద్ధమునందుఁ జచ్చినపిదప, దుర్యోధనుఁడు పాండవులచే మర్మోద్ఘాటనము చేయఁబడుసందర్భమునఁ జెప్పుకొనియున్నాఁడు. అట్టి దురవస్థలో శత్రులయెదుటఁ దనకు లేనిఘనతను జెప్పికొని యుండఁడు గదా! పయిపద్యమునందలి రాజులనేలుట యనునంశము కర్ణవధవిని శోకించుధృతరాష్ట్రుఁడు పలికిన

"వైదేహపాండ్రాదివసుధేశు లెవ్వనికడిమిసొంపున నరిగాపు లైరి"

అను కర్ణపర్వములోని సీసపాదముచే గూఢమూల మగుచున్నది. ఆంధ్రభారతమున నే కారణముననో యీ విషయమున నీ సీసపాద మొక్కటి మాత్రమే యగపడుచున్నది. ఏ కారణముననో యననేల ? కర్ణదిగ్విజయసందర్భ మాంధ్రభారతమున నాంధ్రీకరింపఁ బడకుండుటయే యిందుకు మూలమైయుండును. సంస్కృతభారతమునం దన్ననో కర్ణదిగ్విజయవృత్తాంతము నెల్ల



స్మరించి ధృతరాష్ట్రుఁడు దుఃఖించినట్లు విపులముగా వర్ణింపఁబడియున్నది.

"యో ఽజయ త్సర్వకాంభోజా నవంత్యా న్కేకయై స్సహ,
గాంధారా న్మద్రకా న్మాత్స్యా న్త్రిగర్తాం స్తఙ్గణాన్ శకాన్
పాంచాలాం శ్చ విదేహాం శ్చ కులిందాన్ కాశికోసలాన్,
సుహ్మా నఙ్గాం శ్చ వఙ్గాం శ్చ నిషధాన్ పుండ్రకీకటాన్.
వత్సాన్ కలింగాన్ దరదా నశ్మకా నృషికా నపి,
శబరాన్ హారహూణాం శ్చ ప్రఘూణాన్ సరళా నపి.
మ్లేచ్ఛరాష్ట్రాధిపాం శ్చైవ దుర్గా నాటవికాం స్తథా,
... ... ...
దివ్యాస్త్రాణి మహాతేజాః కర్ణో వైకర్తనో వృషః,
దుర్యోధనస్య వృద్ధ్యర్థం కృత్వాన్న ముర్వీ మథాజయత్.
యం లబ్ధ్వా మాగధో రాజా సాంత్వమానో ఽథ సౌహృదైః,
అరౌత్సీత్ పార్థివం క్షత్త్రం ఋతే యాదవకౌరవాన్."

అని యిట్లు వ్రాయఁబడియున్నది.

ఇట్లే దుర్యోధనునకుఁ బాండవు లయరణ్యవాసకాలమునఁ గొన్నియుద్ధసంకటములు తటస్థించిన ట్లుద్యోగపర్వములోని యీ క్రిందిపద్యము సూచించుచున్నది.

ఉ. "ఒక్కొకనాఁ గడంగి ప్రతియోధులు మార్కొనునప్పు డాత్మలన్
నెక్కొని మోహులం బొడను నెవ్వగతోడ జనంబు లిట్టియం
దక్కట భీముఁ డైన మనయర్జునుఁ డైనను మాద్రిపుత్రులం
దొక్కరుఁ డైన నీపగల నుక్కడఁగింపరె యొక్కవ్రేల్మిడిన్?"

(1 ఆ. 287 పద్యము.)

పైనుదాహరించినదుర్యోధనుని మంచిచరిత్రలు గాని యుద్ధసంకటములు గాని పాండవులచరిత్రలట్లు విపులముగా మహాభారతకవి వర్ణింపలేదు. మఱియు నరణ్యవిరాటపర్వములు రెండును బాండవులచరిత్రలతోడను మూలకథ కంతగా సంబంధము లేనియుపాఖ్యానములతోడను వెళ్ళఁబుచ్చెను. పైకారణముల నరయఁగా మహాభారతకవి పాండవులచరిత్రమునే మూలకథగాఁ జేసికొనినట్లు స్పష్టపడుచున్నది.

అట్లయినను, సత్యప్రకాశనపరులగు చరిత్రకారులు నేర్పుతోఁ బ్రతినాయకపక్షమునందలి మంచిచెడ్డలను సైతము వర్ణింపకపోరు. మహాభారతకవియుఁ గౌరవులశౌర్యమును వారి చరిత్రమును విరళముగ వెల్లడించియే యున్నాఁడు. కావున నట్టివర్ణనముల నాధారముగఁ జేసికొని కౌరవపక్షములోని యితరవిషయముల నూహించుకొనుట యుక్తము.

కర్ణుఁడు గాంతేయుఁడే యైనను గౌరవపక్షమువాఁడగుటచేతను, నర్జునునకుఁ బ్రతిద్వంద్వి యగుటచేతను నాతనిచరిత్రమును బయినుదాహరించిన కారణములచే నంతవిపులముగా వర్ణింపఁబడలేదు. కర్ణుఁడు నిత్యసత్యవ్రతుఁడును, మహాదాతయు, ధర్మాత్ముఁడును నైనను పైకారణములచేతనే కావలయును మహాభారతమునఁ దఱచుగ నిందింపఁబడియున్నాఁడు. పాండవులకు 'పక్కలోనిబల్లెము'వంటివాఁడెయైనను బలుమాఱు నిరసింపఁబడుచు వచ్చెను. లోకోత్తరచరిత్రుఁడును, నుభయపక్షములకు సమానబంధుఁడును గురువృద్ధుఁడును నగుభీష్ముఁ డతని బొత్తిగా నిరసించినట్లు మహాభారతమునఁ జెప్పఁబడియున్నది. అట్టిభీష్ముని ననుసరించుట తక్కినపెద్దలకు సహజమె గదా!



ఈసందర్భమున భీష్ముఁ డిట్లు కర్ణుని నిరసించుటకుఁ గారణము లేకపోలేదు. ఆతఁ డుభయపక్షములకును సమానబంధుఁడును, నీతిశాస్త్రకోవిదుఁడునునై యుండుటచే నెట్లైన సంధి చేసి కులనాశనము కాకుండఁ జేయఁదలఁచె నని యూహింపవలసియున్నది.

"భీష్మేణ రాజా కౌరవ్యో ధృతరాష్ట్రోఽభిషేచితః,
అర్థధర్మప్రధానాసు విద్యాసు వివిధాసు చ.
గతః పారం యథాపాండు స్తథా సేనాపతిః కృతః." (ఆది.118-అ)

"వ. అంబికేయుధృతరాష్ట్రు రాజ్యాభిషిక్తుం జేసి భీష్ముఁడు.

ఉ. ఆయముగర్వము న్విడిచి యన్యపతుల్ పనిసేయ నిట్లుగాఁ
గేయభుజాబలంబున నికృత్తవిరోధిసమాజుఁడై క్షమా,
రాయితశక్తిశాలిధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న
త్యాయతకీర్తితోఁ దనదు హస్తిపురంబది రాజధానిగాన్."

(భారతము ఆదిపర్వము. 5. ఆశ్వాసము. 6. పద్య)

అనువాక్యములను బట్టి చూడఁగా, జ్యేష్ఠుఁడును, బట్టాభిషిక్తుఁడును నగుధృతరాష్ట్రునిపుత్త్రుఁడైన దుర్యోధనునకే కురురాజ్యమునందు సంపూర్ణమగు నౌరసత్వపు (వారసత్వపు) హక్కుగలదనియుఁ, బాండవులకు లేదనియు విశద మగుచున్నది. అయినను బలవంతులగు రాజులు పరరాజులను జయించి వారిరాజ్యముల నాక్రమించుకొనుట రాజధర్మమై యుండెను. సంజయురాయబారపుఁగాలమున శ్రీకృష్ణుఁడు ధర్మనిర్ణయము చేయుసందర్భములోని

"ఉతాహో త్వాంమన్యసే శామ్యమేవ రాజ్ఞాం యుద్ధే వర్తతే ధర్మతంత్రం ఆయుద్ధే వా వర్తతే ధర్మతంత్రం తథైవ తే వాచమిమాం శృణోమి."

(ఉద్యో 29 అధ్యాయ)

అనువాక్యమే పైయంశమును వ్యక్తపఱచుచున్నది

ఇట్టిధర్మము నవలంబించి ప్రబలు లగుపాండవులు దుర్యోధనుని జయించి రాజ్యము నాక్రమింతురనియు నట్టియెడఁ బొసఁగుయుద్ధమున నుభయపక్షములు నశించుననియుఁ దలఁచి యంధుఁడగుధృతరాష్ట్రునెడ భక్తితోఁ బ్రవర్తించిన పాండురాజుప్రవర్తనమును బోధించి ప్రబలు లగు పాండవులకుఁ గొంతరాజ్యము నిప్పించుట కర్తవ్యమని యుభయకుల సమానబంధుఁడగు భీష్ముఁడు నిశ్చయించుకొని యట్లుపదేశించెను. దుర్యోధనుఁడందుల కంగీకరింపనందున రాజనీతికోవిదుఁడగు భీష్ముఁడు పలుమాఱు దుర్యోధనపక్షపుయోధులను నిరసించుచుఁ బాండవులపైఁ బక్షపాతముఁ జూపుచు ద్రోణాది కురుయోధులకు మనసువిఱుగునట్లు ప్రసంగించుచు వచ్చెను. అట్లు చేసినచోఁ బాండవులు ప్రబలు లనియు స్వపక్షము వారికిఁ గూడఁ బాండవులపైఁ బక్షపాతము గలదనియు బెదరి దుర్యోధనుఁడు సంధి కంగీకరించు ననియాతఁ డభిప్రాయపడెను; కాని యీవిషయమున భీష్ముని నీతికౌశల మనర్థకారియయ్యెను. దుర్యోధనుఁడు మహామానియు విశ్వాసపాత్రులగు కర్ణాది వీరులు గలఁవాఁడును నగుటచే, భీష్మునియుపదేశములను గణుతింపఁ డయ్యె.

"క. ఉక్కఱిసునపతికైనను, మొక్కమునృపధర్మమూఁది మొనతలఁబడివన్
మిక్కిలిపేరునునిటపెవి, నక్కజముగఁ బెంపుఁబడయనగుటను పేంద్రా!"
(ఉద్యో. 3 ఆ 361)

అని గదా దుర్యోధనుఁడు కృష్ణురాయబారపుఁ గాలమునఁ జెప్పియున్నాఁడు.



దుర్యోధనుఁడు సంధి కంగీకరింపకుండుటకు దుర్యోధన పక్షపాతియు మహావీరుఁడును నగుకర్ణుఁడే మూలకారణ మని తలఁచి యాతనిని భీష్ముఁడు పలుమాఱును నిందించుచు వచ్చెనని శరతల్పశాయి యగుభీష్ముని యీక్రిందివాక్యములె వ్యక్తపఱుపఁగలవు.

"క. నీదెసఁ గోపింతునె కులభేదముగాఁ బలుకుటయును బిడ్డలఁ జెఱుపం
గాదని కినియుదు లేదన, రా దలఁతును నిన్ను నిష్ఠురంపుఁబలుకులన్."

వ. అది శిక్షగాని రోషంబుగా దట్లుం గాక.

క. నీయుదయము దైవికగ, ర్భాయత్తము నీవు మర్త్యు లసదృక్షులు కొం
తేయుఁడవు గాని వినుఁ రా, ధేయుఁడవు గావు నీవు ధీరవిచారా!"
(భీష్మ. 3 ఆ. 441-442-443)

'జానామి సమరే వీర్యం శత్రుభిర్దుస్సహం భువి,
బ్రహ్మణ్యతాం చ శౌర్యం చ దానే చ పరమాం స్థితిమ్.
న త్వయా సదృశః కశ్చిత్పురుషేష్వమరోపమ,
కులభేదభయాచ్చాహం సదా పరుషముక్తవాన్.
ఇష్వస్త్రే చాస్త్రసంధానే లాఘవే ఽస్త్రబలే తథా
సదృశః ఫాల్గునే నాపి కృష్ణేన చ మహాత్మనా,
కర్ణ కాశిపురం గత్వా త్వయైకేన ధనుష్మతా,
కన్యార్థే కురురాజస్య రాజానో మృదితా యుధి.
తథా చ బలవాన్ రాజా జరాసంధో దురాసదః,
సమరే సమరశ్లాఘీ న త్వయా సదృశో ఽభవత్.
బ్రహ్మణ్యస్సత్యయోధీ చ మనుష్యైరధికో యుధి,
వ్యపనీతో ఽద్య మన్యుర్మే యస్త్వాం ప్రతిపురాకృతః.
దైవం పురుషకారేణ న శక్యమతివర్తితుం,
సోదర్యాః పాండవా వీరా భ్రాతరస్తే ఽరిసూదన.

ఈవిషయమునఁ గులనాశనము కాకుండఁ జేసికొనుటకై భీష్ముఁడు పవిత్రమగు తనచరిత్రమును గళంకితమగుటకును నంగీకరించెను. కావుననే కదా! సంధికాలములలో దుర్యోధనుని వెఱపించుటకై కర్ణుఁడు మహారథుఁ డని యెఱింగియు నాతనినర్ధరథుఁ డని నిరసించెను. తుదకుఁ దనకులమునకుఁ గళంకము నాపాదించుకర్ణజన్మవిషయక మగుకుంతీచరిత్రమును వెల్లడించుటకు సాహసించియు నట్టియుద్ధసంకటమందు దుర్యోధనుని విడిచి పాండవులలోఁ జేరుమని కర్ణునకు బోధచేసియుఁ దనఘనమైనచరిత్రమును మాపికొనెను. కర్ణుఁడు దుర్యోధనుని విడుచుటయే కాక పాండవులలోఁ జేరుటయు సంభవించిన

---

సంగచ్ఛతై న్మహాబాహో మమచే దిచ్ఛసి ప్రియమ్."

(భీష్మ. 124 అధ్యా.)

ఇంతియకాక కర్ణునిదిగ్విజయము నయితము భీష్ముఁడు స్తుతించి యున్నాఁడు.

"కర్ణరాజపురం గత్వా కాంభోజా నిర్జితా స్త్వయా,
గిరివ్రజగతా శ్చాఽపి నగ్నజి త్ప్రముఖా న్నృపాః.
అంబష్ఠా శ్చ విదేహా శ్చ గాంధారా శ్చ జితా స్త్వయా,
హిమవద్దుర్గనిలయాః కిరాతా రణకర్కశాః."
"దుర్యోధనస్య వశగాః కృతాః కర్ణ త్వయా పురా,
ఉత్కలా మేఖలాః పౌండ్రాః కళింగాంధ్రా శ్చ సంయుగే.
నిషాదా శ్చ త్రిగర్తా శ్చ బాహ్లీకా శ్చ జితా స్త్వయా,
తత్ర తత్రచ సంగ్రామే దుర్యోధనహితైషిణా,
బహవో నిర్జితా వీర త్వయా కర్ణమహౌజసః."

(ద్రోణపర్వము 4 అధ్యాయ)



మొదల దుర్యోధనుఁడు నిరాశుఁడై నిరాటంకముగా సంధి కంగీకరించు నని తలఁచి భీష్ముఁ డెట్టి పనికైనఁ దలపడెను. కులనాశకమును లోకనాశకమును నగు యుద్ధమును నిలుపుటకై యట్టిపనులు చేయుట తప్పుకా దని యాతనియాశయము. ఇట్టి గుట్టును గనుపెట్టక భీష్ముఁడు పలుమాఱు కర్ణుని నిరసించిననిరసనములను యథార్థములనుగ గ్రహించుట యసంగతము.

అట్లయినను గవి కర్ణుని యుద్ధాదిసందర్భములలో నాతని సామర్థ్యాదికమును వెల్లడింపక పోలేదు. సామాన్యముగాఁ జదువువారలు కవియొక్క యీచాతుర్యమును గనుపెట్టఁజాలక తఱచుగా నగపడుకర్ణవిషయకములగు నిందలను నిరసనములనుజూచి యాతఁడు దుర్మార్గుఁ డనియు, బలహీనుఁ డనియు భ్రమపడుదురు. అట్టిభ్రమయె కర్ణుఁడుదుష్టచతుష్టయములోనివాఁడను వాడుకకుఁ గారణ మని తోఁచుచున్నది. అయ్యది కేవలము ప్రమాదము.

ఇఁక దుర్యోధనునికార్యములయం దాతనికి సమ్మతముగాఁ బ్రవర్తించుట స్వామిభక్తుఁ డగుకర్ణున కొకయవగుణము కానేరదు. అవయసరయ నదియు నాతని సుగుణపరంపరలోనె లెక్కింపఁదగియుండును. దుర్యోధనునితో మైత్రినొంది యాతనిచే సత్కారములఁ బొందిన పిదపఁ బాండవులు తనసోదరులని స్పష్టముగాఁ దెలిసినను సూర్యుఁడు, కుంతి, శ్రీకృష్ణుఁడు మొదలగువారు పాండవులపక్షములోనికి రమ్మని యెంతబోధించినను రాజ్యాధిపత్య మిప్పించెద మనివారు ఘోషించినను నించుకేనియు నాశపడక దుర్యోధనుని సేవకత్వమును వీడక స్వామికార్యమునకై ప్రాణములు ధారపోసెను. ఇట్టి యీపుణ్యపురుషుఁడు

మైత్రీనిశ్చలత, స్వామిభక్తి, శౌర్యము, కీర్తిలోభము, వైరాగ్యము మొదలగు మహాగుణములను లోకమునకుఁ బ్రదర్శించుటకై జన్మించినవాఁడని పేర్కొనవచ్చును. ఇంద్రుఁడు కపటియై తన్ను మోసము చేయవచ్చినవాఁడని యెఱింగి తనప్రాణములనుదృణముగా నైనఁ దలఁపక యమృతమయములగు కవచకుండలముల నొలిచి యాతనికి దానముచేసిన యీమహానుభావుని సత్యవ్రతము దానశీలతయును లోకోత్తరము లనుట యతిశయోక్తి కానేరదు.

ఈమహాపురుషునిచరిత్రముసామాన్యముగ నందఱకును దెలియుటకై వర్ణనాదికములతో గ్రంథమును బెంపక సులభశైలితో నాశక్తికొలఁదిని దీనిని వ్రాసితిని. ఆయాసందర్భములందుఁ బ్రమాణముగాఁ జూపవలసిన సంస్కృతశ్లోకములు క్రింద లఘుటీకవలె (Foot Note) వ్రాయఁబడెను. గుణగ్రహణపారీణు లగుసహృదయు లిందలిగుణలేశములను గ్రహించి స్వభావసులభ మగుసమ్మోదమును బొందుదురు గాక

ఇట్లు, విన్నవించువిధేయుఁడు,

16-4-1917 }
విజయనగరము }

వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి,
గ్రంథకర్త.

శ్రీరస్తు.

# కర్ణచరిత్ర

## మొదటి ప్రకరణము.

### కర్ణుని జన్మము.

యాదవరాజగుశూరుఁ డనువానిపుత్రికలలోఁ బెద్దదియు వసుదేవునిచెల్లెలునగుపృథ యనుకన్యకను శూరుని మేనత్తకుమారుఁ డగుకుంతిభోజుఁ డప్పటికి సంతతిలేనివాఁ డగుటచేఁ బెంచుకొనుచుండెను. ఆమె యాకుంతిభోజునింటఁ బెరుఁగుచుఁ దండ్రియాజ్ఞచొప్పున నతిథిపూజ చేయుచుండెను. ఒకప్పుడు దుర్వాసుఁడనుఋషి కొంతకాల మాతనియింట నతిథిగా నుండఁ గోరినందున నాతనికిఁ బరిచర్యచేయుటకై కుంతిభోజుఁడు తన పుత్రిక యగుకుంతిని నియోగించెను.

సులభకోపుఁ డగుదుర్వాసుఁడును గుంతి యోర్పుతోఁ జేసినయద్భుత మగుసేవకు మెచ్చి వరమును గోరుకొ మ్మనెను. "మహాత్మా! మీరు నాయందుఁ బ్రసన్నులగుటకంటె నాకేమి కావలయును? తమ యీప్రసన్నతకు మాతండ్రియు మిక్కిలి

యానందము నొందుదును. అదియే నాకు గొప్పవరము" అని కుంతి విన్నవించెను. అట్లయినను మరలక త్రికాలవేది యగునా ముని యామెకు రాఁబోవు నాపదయం దుపచరించుటకై యొక దివ్య మగుమంత్రము నుపదేశించెను. అట్లుపదేశించి "నీ వే దేవత నీమంత్రముతో నారాధించెదవో యాదేవత ప్రత్యక్షమై నీవు కోరినలక్షణములు గలపుత్రుని దయచేయును." అనియా మంత్రప్రభావము నామె కెఱిఁగించి యాముని యంతర్ధానము నొందెను.

పిమ్మట నొకనాఁడు కుంతి యామంత్రప్రభావమును బరీక్షింపఁ దలఁచి, సహజకవచకుండలములు గల మహాపరాక్రమశాలి యగుకొడుకును గోరి యామంత్రముతో సూర్యు నారాధించెను. అప్పు డామంత్రశక్తిచేత సూర్యుఁడు సౌమ్యరూపముతో నామెకుఁ బ్రత్యక్షమై యామె కోరినలక్షణములు గల పుత్రునిఁ బ్రసాదించి యంతర్ధానమునొందెను. పిదపఁ గుంతియుఁ దాను గన్యక (వివాహము లేనిది) యైయుండుటచే సూర్యవరప్రసాదభూతుఁ డైనను దత్పుత్రునుంచుకొన వెఱచి తనప్రాణసఖియగు దాదికూఁతుతో నాలోచించి పురసమీపముననున్న యశ్వనది కేఁగి యొక తెప్పపై నొకమంజసమును గట్టి యందాశిశువును బదిలముగా నుంచి యందధికమగు ధనము నుంచి యానదిలో నా తెప్పను విడిచిపెట్టెను. అట్లు విడిచి "నాయనా! యేపుణ్యవతికి నీవు లభించెదవో? ఏయదృష్టవంతురాలు నీముద్దుల ముఱియనున్నదో? ఏభాగ్యశాలిని నీకు మాతయై వీర



మాత యనిపించుకొననున్నదో?" అని పరిపరివిధముల శోకించి దీనమగుముఖముతో నింటికిఁ బోయెను. సూర్యదేవతాప్రసాదమున నీవృత్తాంతము బయల్పడకుండెను.

ఆ తెప్పయు సూర్యునిమహిమచే నిరుపద్రవముగ, నాయశ్వనదిలో నుండి చర్మణ్వతి యందును, నందుండి యమునయందును, దానినుండి గంగానదియందును బ్రవేశించి నదీవేగవశమున సూతదేశములోని చంపాపురసమీపమునఁ బోవుచుండెను. ఆసమయమునఁ దత్పురవాసియు, ధృతరాష్ట్రమిత్రుఁడును నగు నధిరథుఁ డనుసూతుఁ డానదిలోఁ దనభార్యలతో జలక్రీడఁ జేయుచుండి యామంజసమును జూచెను. చూచి యాపేటిక నొడ్డునకుఁ దీయించి దానిం దెఱచి యందు సహజకవచకుండలములతోఁ బ్రకాశించు నాపసిపాపని గాంచెను. కాంచి యానందమును బ్రేమయు నాశ్చర్యమును ముప్పిరిగొన వికసించినమోముతో దనభార్య యగురాధను బిలిచి యాశిశువు నామెచేతి కందిచ్చెను. ఆమెయు సంతతి లేక వగచుచున్నది గావున నత్యానందముతో నాబాలకునిఁ జంకఁ బెట్టుకొని కన్నతల్లివలెఁ బెంచుకొన సాగెను. ఈవృత్తాంతము నాప్తు లగుచారులవలన విని కుంతియుఁ గొంత యూఱడిల్లెను.

ఆపిల్లవాఁడు వసు (బంగారు) సమూహముతో లభించుటచేత వసుషేణుఁ డనియును, సహజములగు (కవచ) కుండలములతోఁ బ్రకాశించుచుండుటచేతఁ గర్ణుం డనియుఁ బేరులు

గాంచెను. మఱియు రాధ పెంచుటచే రాధేయుఁ డనియుఁ గుంతికిఁ గన్యకావస్థలోఁ గల్గుటచేఁ గానీనుఁ డనియు ధర్మాత్ముఁ డగుటచే వృషుఁ డనియు నాతనికిఁ బేరులు గలిగెను.

కురువంశపురాజు లాకాలమునకు హస్తినాపురమును రాజధానిగఁ జేసికొని కురుదేశములను బాలించుచుండిరి. తద్వంశజుఁడగు ధృతరాష్ట్రుఁ డప్పటికి రాజయి యుండెను. ఆతఁడు కుమారవర్గమునకు ధనుర్విద్య నేర్పుటకై కృపద్రోణాచార్యుల నియోగించెను. అపుడు కురుపాండవులేగాక (రెండు తెగలవారును గౌరవులె యనఁదగి యున్నను, భేదము తెలియుట కిట్లు వ్యవహరింతురు.) *యాప్రాంతమునందలి రాజపుత్రు లనేకులు వచ్చి

* శంతనుఁడు






ధనుర్విద్య నేర్చుకొనుచుండిరి. ధృతరాష్ట్రమిత్రుఁ డగు నధిరథుఁ డను దనపుత్త్రుఁ డయిన కర్ణుని విద్యాభ్యాసమునకై యాయుధ ర్వణికశాలలయందుఁ బ్రవేశపెట్టెను. అప్పటి విద్యార్థులందఱిలోను గర్ణార్జునులు మిక్కిలి నేర్పరులయి పన్నికెక్కియుండిరి. జ్ఞాతు లగు పాండవులయభివృద్ధి నోర్వఁజాలని దుర్యోధనుఁడు విద్యాభ్యాసమాత్సర్యమున నర్జున ప్రతిస్పర్ధి యయియున్న కర్ణునియందుఁ బక్షపాతము గలిగి యుండెను. కృపద్రోణాచార్యులు రాజపుత్రుఁ డగు నర్జుననియందుఁ బక్షపాతము నంది యుండిరి.

---

## రెండవప్రకరణము.

### — కర్ణుఁ డంగరాజగుట —

రాజపుత్రు లందఱును ధనుర్విద్యయందు సంపూర్ణ నైపుణ్యము నొందిన వెనుక ద్రోణాచార్యుని ప్రార్థనముపైని ధృతరాష్ట్రుఁడు కుమారాస్త్రవిద్యాప్రదర్శనమునకై యొక గొప్ప సభ చేయించెను. ఆసభ వ్యాసమహాముని మొదలగు ఋషులతోడను, భీష్ముఁడు మున్నగు కురువృద్ధులతోడను, విదురప్రభృతిమంత్రివర్గముతోడను, మఱియు ననేకులగు సామంతరాజులతోడను, గాంధారి కుంతి మొదలగు ననేక రాజస్త్రీలతోడను నిండియుండెను.

అట్టిసభలో ద్రోణాచార్యుఁడు తనశిష్యులకుఁ దానునేర్పినయస్త్రవిద్యాకౌశలమును వారివారిచేతఁ జూపింప నారంభించెను. అప్పు డారాజపుత్త్రులు, గుఱ్ఱపుస్వారియందును, గదాఖడ్గాదులసామునందును, బాణములను త్వరగా సంధించుట, దృఢముగాఁ బ్రయోగించుట, దూరముగా నేయుట, సూక్ష్మలక్ష్యములఁ దునుముట మొదలగువానియందును దమతమకుఁ గలకౌశలములను బ్రదర్శింపసాగిరి. అందు గదాకౌశలమున భీమదుర్యోధనులు వాసిగాంచిరి. అర్జునుఁడు ధనుర్విద్యయందసహాయుఁడయి పెనుబాహారించిన పలువిధములగుకౌశలము లం బ్రదర్శించెను. మఱియు నాగ్నేయవారుణాదులగు నస్త్రములం బ్రయోగించి భయంకరములగు నగ్నిజ్వాలాదులనుబుట్టించుచు నామాయాస్త్రముల నుపసంహరించి వానిని మాన్పుచు నదృశ్యాదిదివ్యాస్త్రముల నేసి తా నదృశ్యతాదివికారముల నందుచు విజృంభించెను. అప్పు డాయర్జుననిధనుఃకళాకౌశలమునకు సభాసదు లందఱు నాశ్చర్యసమ్మోదమగ్నమానసు లయిరి. దుర్యోధనాదులుమాత్రము విషాదాయత్తచిత్తులయి యుండిరి.

ఆసమయమున నారాజపుత్త్రమండలిలోనుండి సహజములగు కవచకుండలములతోఁ గూడి, రెండవసూర్యునివలెఁ బ్రకాశించుచున్నట్టియు, నస్త్రాభ్యాసకాలమునుండియు నర్జునునకుఁ బ్రతిస్పర్ధియయియున్నట్టియుఁ గర్ణుఁడు బయలువెడలి యర్జును ధిక్కరించుచు దుర్యోధనాదులానందింప నర్జునాదులు



మత్సరించి కోపింప నమ్మహాసభయం దర్జునప్రదర్శితము లగు కళాకౌశలముల నెల్లఁ దాను ననాయాసముగాఁ జూపించెను. అట్టియెడ దుర్యోధనుఁ డాతనిఁ గౌఁగిలించుకొని స్తుతింపఁగా నందుల కుప్పొంగి యీసభవారును నీవును జూచుచుండ నర్జుననితోడ ద్వంద్వయుద్ధము చేసి వాని నోడించెద నని యాతఁడు పలికెను.

ఇట్లు స్వప్రదర్శితములగు కళాకౌశలములనుజూపినవానిఁ గాంచి కౌరవులచే సంభావింపఁబడుచున్న యాకర్ణుఁ జూచి యర్జునుఁడు మత్సరించి. "ఓరనీచుఁడా! నీశక్తియు నెదుటవానిశక్తియు నెఱుఁగక యేమేమో ప్రేలెదవు. నిన్నెవ్వ రీరంగమునకుఁ బిలిచి రావించిరి. ఇప్పుడు నాచే హతుఁడ వయి నీవనాహూతులయి సభలకు వచ్చి ప్రేలువారిలోకముల నొందఁగలవు" అని పలికెను. అదివిని కర్ణుఁడు "ఓయీ! యీవెడఁగుమాట లేల? శక్తిగలదేని నాతో సరిగ నీయస్త్రకౌశలముం జూపుము. ఈయస్త్రప్రదర్శనరంగము దస్త్రవిద్యావిశారదు లందఱకును హక్కుగలదు. బహిరంగమగుసభలోనికి "వీరు రావచ్చును, వారు రాఁగూడదు. అను నియమముండునా?" అని సయుక్తికముగా నదలించెను. అందులకుఁ గోపించి యర్జునుఁడు యుద్ధసన్నద్ధుఁడు కాఁగాఁ గర్ణుఁడును నాయత్తమయ్యెను.

---

సంస్కృతభాగవతమునందును నిట్లే యర్జునుఁడే మొదటఁ గయ్యమునకుఁ గాలు ద్రువ్వినట్లున్నది; కాని యాంధ్రభాగవతమున నట్లుగాక మొదటఁ గర్ణుఁడు యుద్ధమునకు సిద్ధము కాఁగాఁ బిదప నర్జునుఁడును సన్నద్ధుఁ డైనట్లున్నది.

అపుడు మేఘవాహనుఁ డగు దేవేంద్రుఁడు తనపుత్రుఁ డగునర్జునునిపరాక్రమమును జూడఁగోరి యంతరిక్షమున నిలిచెను. సూర్యుఁడును దనతనయునిపరాక్రమమును జూడఁగోరి తన్నావరించినయింద్రవాహనము లగుమేఘములను దన కిరణములచేఁ దూలించి ప్రకాశింపసాగెను.*

అపుడు కుంతి సహజములగు కవచకుండలములచే నాకర్ణుని దనకుమారునిగ గుఱుతుపట్టియు లోకనిందకు వెఱచి ప్రకటింపఁజాలక మూర్ఛిల్లఁగా శీతలోపచారములు చేసి విదురుఁ డామెను దేర్చెను.

* ఈసందర్భమున సంస్కృతభారతమున నిట్లున్నది. "తతో దుర్యోధనే నాపి సభ్రాతా సముద్యతః, పరిష్వక్తః స్థితః కర్ణః ప్రగృహ్యాసశరం ధనుః. తత స్సవిద్యుత్ స్తనితైః సేంద్రాయుధపురోగమైః, ఆవృతం గగనం మేఘైః బలాకాపంక్తిహాసిభిః. తత స్స్నేహా ద్ధరిహయం దృష్ట్వా రంగావలోకినం భాస్కరోఽప్యనయన్నాశం సమీపోపగతాన్ ఘనాన్. మేఘచ్ఛాయోపగూఢస్తు తతో ఽదృశ్యత ఫల్గునః, సూర్యాతపపరిక్షిప్తః కర్ణోఽపి సమదృశ్యత. కున్తిభోజసుతా మోహం విజ్ఞాతార్థా జగామహ" అనియున్నది. (ఆదిసంభవపర్వము 136-అధ్యాయము 22-శ్లోకము మొదలు)

ఇట్లుండఁ దెలుఁగుభారతమునఁ గర్ణార్జునులు యుద్ధసన్నద్ధులయిన పిదపఁ గర్ణుఁ డర్జునునిపైని బర్జన్యాస్త్రము నేయఁగా మేఘములు గ్రమ్మెననియు, నర్జునుఁడు దానికిఁ బ్రతిగ వాయవ్యాస్త్రము నేయఁగా మేఘములు పడలెననియు నన్నయభట్టు తెలిఁగించుటకుఁ గారణము తెలియకున్నది. వారిట్లు ద్వంద్వయుద్ధము చేయుచున్నప్పుడు వచ్చి కృపాచార్యుఁడు కర్ణుఁడు ద్వంద్వయుద్ధమున కర్హుఁడుకాఁడని చర్చించుట కేమిఫలమో తెలియకున్నది.



అట్లు ద్వంద్వయుద్ధమునకు సన్నద్ధులయి యున్నకర్ణార్జునులలోఁ గర్ణునిపక్షమున ధృతరాష్ట్రపుత్రులును నర్జునునిపక్షమున భీష్మద్రోణకృపాదులు నుండిరి. ఆసమయమునఁ గృపాచార్యుఁడు "అర్జునుఁడు కురువంశమునఁ బుట్టినవాఁడును బాండురాజపుత్త్రుఁడు నైన యుత్తమక్షత్రియుఁడు. ఈతనితో నీకు ద్వంద్వయుద్ధము కావలయునేని నీకులగోత్రములను జెప్పుము. నీ వర్హుఁడవయినయెడల నీకీతఁడు ద్వంద్వయుద్ధము నీయఁగలఁడు." అని కర్ణునితోఁ బలికెను. అపుడు సూతపుత్త్రుఁ డగుకర్ణుఁడు తనది నీచకులమని చెప్పుకొనుటకు లజ్జించి మోము వాంచెను. "ఉత్తమకులమునఁ బుట్టినవాఁడును, సేనలు గలవాఁడును, శౌర్యవంతుఁడును రాజు లనిపించుకొందురు. అట్టివారు పరస్పరము ద్వంద్వయుద్ధమున కర్హులయి యుందురు. ఈతఁడు శౌర్యశాలియగుటచేతనే యర్జునునితో ద్వంద్వయుద్ధము చేయ నర్హుఁడు. అయినను నీతఁడు భూనాథుఁడైనం గాని యర్జునునితో ద్వంద్వయుద్ధమున కర్హుఁడు కాఁడని యందురేని యిదె యీతని కంగదేశము నిచ్చి రాజును జేయుచున్నాను"* అనిచెప్పి

* సంస్కృతభారతమున "విజ్ఞాతార్థా" అని స్పష్టముగాఁ జెప్పఁబడి యుండఁగా నర్జునుఁడు కర్ణప్రయుక్తమగుపర్జన్యాస్త్రముచేఁ గప్పఁబడినందునఁ గుంతి మూర్ఛిల్లెనని నన్నయ యాంధ్రీకరించుటకు మూలమేమో తెలియకున్నది

దుర్యోధనుఁడు తోడనే కర్ణున కంగరాజ్యపట్టాభిషేకము చేసెను. కర్ణుఁ డందులకు మిక్కిలి సంతోషించి "ఓమహారాజా! ఇమ్మహాసభలో నన్ను మన్నింపఁదగినవానిఁగాఁ జేసి బహూకరించిన నీ కేమి ప్రతిచేసి కృతజ్ఞుఁడ నయ్యెదను?" అని పలుకఁగా, "నీవు నాకుఁ బ్రాణసఖుఁడ వయియుండుటయే వాంఛితము" అని దుర్యోధనుఁడు ప్రార్థించెను. సత్యవ్రతుఁ డగుకర్ణుఁ డందులకు దృఢమగుమనస్సుతో నంగీకరించెను.

ఇది యంతయుఁ జూచి సంతోషము పట్టఁజాలక, కర్ణుని తండ్రియగు నధిరథుఁడు "పుత్రకా!" అనుచు వచ్చి కౌఁగిలించుకొని పితృగౌరవమున నమస్కరించుచున్న కర్ణుని కానందబాష్పములతోఁ బునరభిషేకముం జేసెను. అప్పుడు భీముఁడు "ఓయీ సూతనందనా! నీకులమునకుఁ దగినట్లుగ నొకముని కోలను బట్టుకొని నొగలెక్కి రథము గడపక రథికుఁడ నయ్యెదననియు నుత్తమక్షత్రియుఁ డగునర్జునునితో ద్వంద్వయుద్ధముఁ జేసెద ననియుఁ దలఁచెద వేల? మఱియు నుత్తమక్షత్రియుఁ డనుభవింపఁ దగిన యంగరాజ్యమునకు నీవభిషిక్తుఁడవగుట మంత్రపూతమగు పురోడాశమును కుక్క ముట్టుకొనుట కాదా?" అని దుర్యోధనునకును గర్ణునకును మనశ్శల్యముగాఁ బరిహసించుచుఁ బలికెను. కర్ణుఁడు వెలవెలఁబోయి *సూర్యునివైపు

"ఏవ ముక్తః స్తతః కర్ణః కించి త్ప్రస్ఫురితాధరః, గగనస్థం వినిశ్వస్య "దివాకర ముదైక్షత." అని సంస్కృతమునను నిట్లే యున్నది. దీనిని బట్టిచూడఁగా నిప్పటికే కర్ణునికిఁ దనజన్మవృత్తాంతము తెలిసినట్లు స్ఫురించుచున్నది.



చూచుచు వేఁడినిట్టూర్పులు తీయుచు మోము వాంచియుండెను.

"ఓయీ' వాయుపుత్రుఁడా! నీవు నిట్లు పలుకనగునా? నదులయుత్పత్తియు, దేవతలజన్మమును, శూరుల సంభవమును దెలిసికొనుట శక్య మగునా? మహానుభావుఁ డగుద్రోణాచార్యుఁడు కుండలోఁ బుట్టినాఁడు కాఁడా? అట్లె పూజ్యుఁడగు కృపాచార్యుఁడును శరస్తంభమున జనింపలేదా? వేయేల? మీజన్మములుమాత్ర మిట్టివే కావా? ఇట్టి దివ్యతేజముగలవాఁడు ప్రకృతిపురుషుఁడయి సామాన్యుఁడయి యుండునా? ఈమహాపురుషుఁ డంగరాజ్యమునే గాదు. భూమినెల్లను నేలఁదగినవాఁడు" అని పాండవులకును వారిపక్షమువారికిని మనసు కొఱలునట్లుగ దుర్యోధనుఁడు పలికెను.

అంతలో సూర్యాస్తమయ మగుటచే నస్త్రప్రదర్శనసభ ముగిసెను. సభాసదు లెల్లరును గర్ణార్జునులవాసినిగుఱించి వివదించుకొనుచు నెవరియిండ్లకువారు పోయిరి. దుర్యోధనుఁడు గర్ణునిఁదోడ్కొని మహానందముతోఁ దననగరికి వెడలిపోయెను.

---

## మూఁడవప్రకరణము.

{ కర్ణుఁడు బ్రహ్మాస్త్రప్రాప్తికై నానాస్త్రములను సంపాదించుట; ఆతనికిఁ గలిగిన శాపములు }

అట్లు విద్యాపరిపూర్ణులయిన వివిధ నారాజపుత్త్రులను జూచి ద్రోణాచార్యుఁడు తనకు విరోధియుఁ బాంచాలదేశపు

రాజును నగుద్రుపదుని గట్టి తెచ్చుట యనుగురుదక్షిణను గోరెను. దుర్యోధనుఁడు ముందుగ దుశ్శాసనాదులగు సోదరులతోను గర్ణాదులగు మిత్త్రులతోను గలసి బయలు దేఱియు ద్రుపదునిఁ గెలువఁ జాలక పరాజితుఁడై మరలెను. అప్పుడు ద్రోణునివలనఁ బుత్త్రాధికముగ ననేకదివ్యాస్త్రములనందియున్న యర్జునుఁడు భీముఁడు మొదలగు తనసోదరులతోఁ గలసి కౌరవులతోఁ బోరి బడలియున్న ద్రుపదునిమీఁదికి వెడలి యాతని నోడించి కట్టి తెచ్చి ద్రోణున కర్పించెను.

అర్జునునకుఁ బ్రతిద్వంద్విగా నుండఁగోరుకర్ణుఁ డందులకు లజ్జించి మత్సరించియే కావలయును నది మొదలుగ దివ్యాస్త్ర సంపాదనమునకు యత్నింపసాగెను. మఱియు నస్త్రప్రదర్శనసభలోఁ బాండవు లవమానించునప్పుడు తన్ను మూర్ధాభిషిక్తునిగా వించిన దుర్యోధనునకుఁ బ్రియముచేయుటయె తనజీవితమునకు సాఫల్యమని తలఁచి కర్ణుఁ డావఱకే దుర్యోధనవిరోధులై యున్న పాండవుల నోడించుటకుఁ దగిన దివ్యాస్త్రములు తనకు లభింపకుండుట కెంతయుఁ బరితపింప నారంభించెను. ద్రోణాచార్యుఁడు, రాజపుత్త్రుఁడును నందును మిక్కిలి నేర్పరియు నగు నర్జునునియందుఁ బక్షపాతమూని యాతనికిఁ దనపుత్త్రునకైనఁ జెప్పనిధనుర్విద్యారహస్యము లుపదేశించి యుండెను. ఇంతియ కాక కర్ణుఁ డధమమగు సూతకులమునఁ బుట్టినవాఁడని ప్రసిద్ధి వెలసియుండుటచేత నాతనికి దివ్యాస్త్రముల నుపదేశింపఁ డయ్యెను.



కర్ణుఁ డొకనాఁడు రహస్యముగా ద్రోణాచార్యులయొద్దకుఁజని నమస్కరించి "ఓగురువర్యా! మీదయవలన నస్త్రవిద్యలో నర్జునుని మీఱఁజాలిననేర్పుగలవాఁడనయి దుర్యోధనునిమన్ననలకు, పాత్రుఁడ నయితిని. శిష్యులందఱయందును సమానమగు ప్రేమము గలతమ రర్జునునకు వలెనె నాకును బ్రాహ్మాదిదివ్యాస్త్రములఁ బ్రసాదించి నన్నుఁ గృతార్థుని జేయ వలయును." అని ప్రార్థించెను. అర్జునుని జయింపఁదలంచియున్న యాకర్ణునియింగితమును గ్రహించి యర్జునపక్షపాతి యగు ద్రోణాచార్యుఁడు "ఓయీ బ్రాహ్మణక్షత్త్రియులు దక్క నితరులు బ్రహ్మాస్త్రోపదేశమున కర్హులుగారు" అని చెప్పి ప్రత్యాఖ్యానము చేసెను.

అట్లయినను గర్ణుఁడు బ్రహ్మాస్త్రసంపాదనవిషయమున నిరాశ నొందక ద్రోణుని వీడ్కొని మహేంద్రగిరియొద్ద దపముఁ జేసికొనుచున్న పరశురామునిదరికిఁ బోయెను. పరశురాముఁడును ద్విజేతరులకు బ్రహ్మాస్త్రము నుపదేశింపఁడని తలఁచి శాస్త్రములందుఁ దండ్రిలలోఁ బరిగణింపఁబడినగురునిగోత్రముతనదని చెప్పుట యసత్యము కానేరదని నిశ్చయించుకొని, భార్గవసగోత్రుఁడ నని చెప్పి యాతనియొద్ద ధనుర్విద్యాభ్యాసమును జేయ నారంభించెను. (కర్ణుఁడు తానుత్తమక్షత్త్రియుఁడని యెఱుఁగును. కాన నాతఁ డీవిషయమున దోషిగాఁడు.). స్వర్గతుల్యమగు నమ్మహేంద్రగిరియందుఁ జరించు ననేకదేవగంధర్వయక్షరాక్షసులతోఁ జెలిమిచేయుచుఁ గర్ణుఁ డనుకూలవర్తన

మునఁ బరశురాముని పరిపూర్ణదయకుఁ బాత్రుఁడయి బ్రహ్మాస్త్రమునే కాక భార్గవాస్త్రము మొదలగు ననేకదివ్యాస్త్రములను బ్రయోగోపసంహారములతో నాతనివలన నుపదేశమందెను.

ఒకానొకనాఁడు కర్ణుఁ డభ్యాసమునకై సముద్రతీరమున బాణములను మిక్కిలి వేగముతో నెగచుచుండఁగఁ బ్రమాదవశమున నాతని బాణమార్గమునఁ బడి యొక యావుపెయ్య మృతినొందెను. అందులకు దానియధిపతి యగు బ్రాహ్మణుఁడు మిగులఁ గోపించి "నా హోమధేనువుపెయ్యను జంపితివి గాన నీ వెవ్వని జయించుటకై యిట్లభ్యసించుచున్నాఁడవో వానితో యుద్ధముచేయునపుడె తుదకు నీరథచక్రము భూమిలోనికిఁ గ్రుంగిపోవును. వానిచేతనె నీవు చంపఁబడుదువు" అని శపించెను.

ఈ బ్రాహ్మణశాపముచేతనే కర్ణునిరథచక్ర మంతకాలమున భూమిలోఁ గ్రుంగిపోయె నని భారతమున స్పష్టముగా వర్ణింపఁ బడియున్నది. అయినను గర్ణుఁ డర్జునునిచేఁ జచ్చుటకుఁ గారణములను శ్రీకృష్ణుఁడు పేర్కొనునప్పుడు

"క. నరవర నీచే నాచే, నర మడిగిన కుంతిచేత వాసవుచేతన్
ధరచే భార్గవుచేతను, నరయంగాఁ గర్ణుఁ డీల్గె నార్గురచేతన్."

అని చెప్పుటలో భూమి నొకవేఱుకారణముగా వర్ణించుటచేఁ గావలయు లోకమున వేఱొకవిధమగు కథ ప్రసిద్ధమై యున్నది. ఒకానొకప్పుడు గురునాజ్ఞచేఁ గర్ణుఁడు నేతిని దెచ్చుచుండఁగా నాచెంబు జారి భూమిపైఁ బడుటచే నేయి యొలికి పోయె ననియు, నప్పుడు మరల నేయి కొని తెచ్చుటకుఁ బోయినచో



నియమితకాల మతిక్రమించి యుపాధ్యాయుఁడు కోపించు ననుభీతి నచ్చటిభూమిని బిడిచి యేమాత్రమును గొంతలేకుండునట్లుగఁ జెంబును నేతితో నింపి దానిని గురువునొద్దకుఁ దీసికొని పోయెననియు నట్లు పిడువఁబడుటచేఁ గోపించి భూమి "ఓయీ! నీ వెవ్వరిని వధించుటకై గురుదయను సంపాదింపఁ గోరి యిట్లు నన్ను నిర్దయముగాఁ బిడిచితివో వానితో యుద్ధము చేయునపు డాపత్కాలమున నీరథచక్రము నాలోఁ గ్రుంగిపోఁ గలదు" అని శపించె ననియుఁ జెప్పుదురు.

బ్రాహ్మణుఁడారీతి శపింపఁగా వెఱచి కర్ణుఁడు వేలకొలఁది గోవులను ధనమును నిచ్చెదననియుఁ గరుణింపు మనియు నా విప్రుని బ్రార్థించెను; గాని యాతఁడు "నామాట వృథకాదు. పొమ్ము." అని చెప్పి నిరాకరించి వెడలిపోయెను. కర్ణుఁడును దన దురదృష్టమునకు మిక్కిలి వగచుచు ఖిన్నుఁడై పరశురాముని యాశ్రమమును జేరెను.

వేఱొక సమయమునఁ బరశురాముఁ డుపవాసమునఁ బడలి కర్ణునితొడపైఁ దల నిడికొని నిద్రించుచుండెను. ♦ఆసమయమున నర్జునరక్షణార్థి యగు నింద్రుని యాదేశమునం గావలయు నళర్కమను నొక భయంకరమగు పురుగు వచ్చి కర్ణునితొడను రక్తము ప్రవహించునట్లుగఁ గొఱుక నారంభించెను. మహాధై

♦శ్లో. "తత్రాపి మే దేవరాజేన విఘ్నో హితార్థినా ఫల్గునస్యైవ శల్య, కృతో విభేదేన మమోరు మేత్య ప్రవిశ్య కీటస్య తనుం విరూపామ్." (భార. కర్ణ. ౪౬ ఆధ్యా.)

ర్యశాలి యగుకర్ణుఁ డుపాధ్యాయుని నిద్రాభంగము చేయనొల్లక తొడ నించుకేనియుఁ గదల్పకుండ సహించి యూరకుండెను; కాని యాతనితొడనుండి స్రవించిన రక్తప్రవాహముచే నొడలు తడిసి మేల్కాంచి పరశురాముఁ డచటఁ బెద్దపందివలె భయంకరముగా నున్న యాపురుగును జూచెను. తోడనె యాకీటకము మృతినొంది యొకరాక్షసుఁడై మింటికెగసి "మహాత్మా! నేను భృగుపత్ని నపహరించి యాతని శాపమునఁ గీటరూపము నొంది (ఆతఁ డనుగ్రహించినట్లుగ) నీ దర్శనామృతసేకమున శాపవిముక్తుఁడ నైతిని." అని పలికి వెడలి పోయెను.

ఆసమయమునఁ బరశురాముఁడు కర్ణుని ధైర్యమున కాశ్చర్యపడి యాతఁడు బ్రాహ్మణుఁడే యైన నిట్లోర్వఁగలిగియుండునా యని శంకించి కర్ణు నదలించి నిజము చెప్పుమని యడిగెను. ఆతఁ డేమి శాపమిచ్చునో యని గడగడవడఁకుచు "మహానుభావా! దివ్యాస్త్రసంపాదనమునం దాసక్తిగల బ్రాహ్మణక్షత్రియేతరుఁడ నగు కర్ణుఁడను పేరుగల సూతుఁడను" అని విన్నవించి చేతులు జోడించి దైన్యముతో నాతని పాదములపైఁ బడియుండెను. అప్పుడు పరశురాముఁడు కోపించి "నీవు నన్ను మోసపుచ్చి దివ్యాస్త్రములను సంపాదించితివి గాన నీకవి యాపత్కాలమునఁ దోఁపకుండును" అని శపియించెను.

కుంతి తనకు లోకాపవాదము రాకుండుటకై కడుపారఁ గన్నకొడుకును జేసేతుల నేటి కప్పగించుటయే గాక యాకు



మారుఁడు తనదౌర్భాగ్యవశమున జీవించి మరలఁ గంటఁబడినప్పుడును మహాసభలో నధమకులుఁడని తిరస్కరింపఁబడుచున్నప్పుడును నట్టియెడ నమ్మహాపురుషుఁడు సిగ్గుపడి తలవాంచియున్నప్పుడును, నాతనియాభిజాత్యమును వెలువరింపకుండుట వింతగా నుండకపోదు. ఇట్టి హానికరమగు నపవాదములో ముంచి యిక్కట్టులపాలుచేయుట కామెకడు పెట్లు సహించెనో! ఇట్టిసమయమునఁ దెలుపక మించినవెనుకఁ దమతో యుద్ధమునకు సన్నద్ధుఁడుకావలసినసమయమున వాదుదీర్చుకొనుటకు రహస్యముగాఁ జెప్పి (ఈవిషయము ముందు వివరింపఁ బడును.) నీతిమంతుఁడగునాతఁడు విననప్పు డతని నిందించుట కామె కెట్లు మనసొప్పెనో తెలియకున్నది. తొమ్మిదినెలలును మోసికన్నతల్లియును గీడుసేయ నెంచుట కాతనిదురదృష్టము కాక వేఱేమి కారణముండును.

పై రీతి దైవానుకూల్యము లేకుండుటచేత "తా నొకటి తలఁచిన దైవ మొకటి తలంచును" అను సామెతచొప్పున నాతఁడభివృద్ధిఁ గోరి చేయుప్రయత్నము లెల్ల నాతనివినాశమునకె కారణము లగుచు వచ్చెను.

---

చ. "జననముఁ జెప్పి యేఁ దెలుప సత్యము నమ్మర కుంతి భాషణం
బని తనుజత్వజాతకృప నంబుజమిత్రుఁడు పల్కె నేమిట
న్గొనకొన నేరఁడయ్యె నినుఁగూఁడ సుయోధనుఁ బట్టియట్టి క
ర్ణునకయి నీవు నేటికి మనోవ్యథఁ బొందఁగ నిట్లు పుత్రికా."

భా. శాం. 1 ఆ. 39.

దైవానుకూల్యము లేనప్పు డమృతమె విషమగుచుండును. అంది పొందినవారె యనాథు లగుచుందురు. కర్ణుఁ డుత్తమక్షత్రియకన్యయుఁ బరిశుద్ధయు నగుకుంతియందుఁ ద్రిమూర్తిస్వరూపుఁడగు సూర్యునివలన జన్మించిన యుత్తమక్షత్రియుఁడై యైనను నాతనికి దురదృష్టవశమున నిట్లధమకులుఁ డనునపవాదము సంభవించినది. ద్రోణాచార్యుఁడు దివ్యాస్త్రముల నుపదేశింపకుండుటకును బరశురాముఁడు తా నుపదేశించిన దివ్యాస్త్రము లాపత్కాలమున స్ఫురింపకుండునట్లు శపించుటకును నీయసత్యప్రవాదమే గదా కారణము. ఇట్టిప్రవాద మాతనికిఁ గడుపారఁ గన్నతల్లివల్లనే సంభవించినది. తల్లి విషముపెట్టినఁ గాపాడువా రెవ్వరుందురు? ఉపాధ్యాయునికి నిద్రాభంగము కలుగకుండుటకై ధైర్యము చిక్కఁబట్టి మంచిమనస్సుతోఁ జేసిన కార్య మారీతిని హానికరముగఁ బరిణమించుటకు దురదృష్టము కాక వేఱొకకారణ మున్నదా? తన యాలపెయ్యను జంపుట యజ్ఞానకృతమని క్షమింపక శమదమాదిగుణగరిష్ఠుఁ డగువిప్రుఁ డతిఘోరముగా శపించుటకుఁ గారణము వక్రించినవిధియె గాక వేఱేమి గలదు? ఆహా! బ్రహ్మదేవుఁడు లోకోత్తరములగు వస్తువుల సృజించియుఁ దనంతన మాపోపక వాని నిట్లు విఫలములం జేయుచుండును గదా! మఱియు నుత్కృష్టవస్తువుల కెట్టికీడులు మూడినను నవి లోకోత్తరముగ వన్నెకెక్కఁజాలియుండునని తెలుపుటకుఁ గావలయు నిట్టిసృష్టిని జూపుచుండును.



ఎట్టిచిక్కులు సంభవించినను ధైర్యశాలులయుత్సాహము ప్రజ్వరిల్లుచునే యుండును. అనుభవింపక తీఱనియశనిపాతములవంటి బ్రాహ్మణ గురుశాపములను బొందియు నర్జునుఁడు దనచేఁ జంపఁబడుట కాశాపములు ప్రతికూలింపఁజాలవని కావలయు నించుకేనియుఁ జలింపక స్థిరమగుమనస్సుతో దుర్యోధనుకడ కేఁగి తనయస్త్రలాభము నెఱింగించి యాతని నానందింపఁజేసెను.

---

## నాల్గవ ప్రకరణము.

—♦కర్ణుని విక్రమములు♦—

ఒకానొకప్పుడు కళింగదేశములోని రాజపురమున కధీశ్వరుఁడగు చిత్రాంగదుఁడు దనకూఁతురగు శుభాంగిస్వయంవరమునకు రాజుల నందఱఁ బిలువం బనిచెను. అప్పుడు దుర్యోధనుఁడును గర్ణసహాయుఁడై యచ్చటి కేఁగెను. ఆసమయమున శిశుపాలరుక్మిజరాసంధాదులగు మహారాజు లనేకులు వచ్చియుండిరి. శుభాంగియు స్వయంవరసభలో రాజులచరిత్రములు వినుచు నొక్కొక్కరినె యతిక్రమించుచు నట్లె దుర్యోధనుని నయితమతిక్రమింపఁబోయెను; కాని దుర్యోధనుఁడంతకు సహింపక యామెను బలవంతముగఁ దనరథముపై నిడుకొని బయలువెడలెను. ఆసమయమున స్వయంవరసభలో నున్న మహావీరులగు రాజులందఱును దుర్యోధనుపైఁ గవియఁగాఁ గర్ణుఁడు తనభుజాబలమును జూపి యారాజలోకమెల్లఁ జెల్లాచెదరయి

పఱచునట్లు విజృంభించి దుర్యోధనున కామోదమును గలిగించెను. ఆయుద్ధములో జరాసంధుఁ డోడిపోయినందున నతఁడు మత్సరించి మరలఁ గర్ణుని వేఱొకసమయమున ద్వంద్వయుద్ధము నకు రమ్మని డీకొనెను. ఏమహాశూరుఁడు శ్రీకృష్ణునియదువృష్ణ్యంధకభోజులతోఁ గూడఁ బలుమాఱు జయించి వాసిఁ గాంచి యుండెనో, ఏవీరపురుషునిదాడికి బెగడొంది శ్రీకృష్ణుఁడు మధురానగరమును విడిచికొని పాఱిపోయెనో, ఏరాజాధిరాజునకుఁ బాంచాలమత్స్యకళింగవంగకుంతిచేదిప్రభృతిసమస్త దేశముల రాజులును లోఁబడి యుండిరో, అట్టి మగధసామ్రాజ్యధురంధరుఁ డగుజరాసంధుఁ డొకవీరునిచేఁ బరాభూతుఁ డగుటకు నెట్లు సహించును? అట్లు డీకొనిన జరాసంధుని నెదుర్కొని కర్ణుఁడును నత్యుగ్రముగాఁ బోరసాగెను. తుద కుభయులును విరథులై ధనుర్బాణశూన్యులై బాహుయుద్ధమున కారంభించిరి. ఆనియుద్ధములో సహజకవచకుండలమండితుం డగుకర్ణుండు జరాసంధునియంగసంధిని భేదించి నొప్పించెను. అప్పుడు జరాసంధుఁడు తనశరీరసంధిని భేదించిన కర్ణునిపరాక్రమమునకు మెచ్చి యాతనితో వైరముమానుకొని మాలినియను నొకపట్టణమునాతనికిఁ గానుకగా నిచ్చి బహూకరించెను. కర్ణుఁడును దనయంగదేశముతోపాటుగ నమ్మాలినీనగరమును బరిపాలించుచు నెదురులేక వాసిగాంచి యుండెను.

పాంచాలరాజగు ద్రుపదుఁడు ద్రోణునిప్రేరణమున నాఁడట్లు పాండవులచేఁ బరాభవింపఁ బడి మత్సరించి ఘోర



మగు తపస్సు చేసి యీశుని మెప్పించి యాతనియనుగ్రహమున ద్రోణుని వధించుకుమారుని నర్జునునకుఁ బత్నిగాఁగల కూఁతును గనియెను. అట్లగుటఁ బాండవులు దుర్యోధనునివంచన చేలక్కయిండ్లలోఁ జనిపోయి రనుపవాదము విని మిగులఁ బరితపించి యీశునివరము వృథయగునా యని యాలోచించి యర్జునేతరునకు మోపెట్టరానివింటిని(అర్జునుఁడు తపస్సు జయించియున్నందున నాతనిబల మతఁ డెఱిఁగియుండెను.) భేదింపరాని యంత్రమత్స్యరూపలక్ష్యముం గల్పించి యావింటిని మోపెట్టి యాలక్ష్యముం దెగనేయువానికిఁ గూఁతు నిచ్చెద నని చాటించి స్వయంవరమునకు రాజుల నెల్ల రావించెను. అప్పుడు దుశ్శాసన కర్ణాదిబంధుమిత్రులతోఁ గూడి దుర్యోధనుఁడును నాసభకు విచ్చేసియుండెను. మఱియు విరాటశల్యచేకితానజయద్రథబృహద్రథ భగదత్తపౌండ్రకవాసుదేవ శిశుపాలజరాసంధాదు లగుసకల దేశాధీశ్వరులును నమ్మహాసభ నలంకరించిరి. ఆసమయమున బ్రాహ్మణవేషధారులయి తిరుగులాడుచున్న పాండవులును దైవవశమున నచ్చటి కేగుదెంచిరి.

ఆ స్వయంవరసభలోనికిఁ ద్రిలోకసుందరియు, సోదరియు నగు ద్రౌపదిం దోడ్కొని వచ్చి ధృష్టద్యుమ్నుఁడు రాజుల నుపలక్షించి "ఓసభ్యులారా! యీదృఢమగు వింటను బాణములం గూర్చి యాకర్ణాంతముగ నెక్కుపెట్టి కులబలరూపసంపన్నుఁ డగునవ్వాఁ డైదు బాణములతో నీయంత్రమత్స్యరూపమగు

లక్ష్యమును దెగవేయునో, యాతని నాసహోదరి వరింపఁగలదు" అని పలికెను.*

ఆసమయమున ననేకరాజు లాధనువుం జూచి నిరాశులై తామున్నచోటినుండి లేవకయె యుండిరి. కొందఱు పేరాసచే ధనువుదరిఁ జేరి కదలింపనైన శక్తిలేక సిగ్గుతో మరలిరి. శిశుపాలజరాసంధశల్యులు వింటినెత్తి యెక్కిడఁ బోయి తూలి మోకాలఁ బడిరి.

అప్పుడు మహాబలియు ధనుర్విద్యావిశారదుఁడును నగు కర్ణుఁడావింటితో బాణమును గూర్చి యాకర్ణాంతముగ నెక్కుపెట్టెను; కాని ♦ "అధమకులుఁ డగుసూతుని నేను వరింపను" అని ద్రౌపది పలికినందున నాతఁడు లజ్జించిసూర్యునివైపు సాభ్యసూయముగఁ జూచుచు వింటిని విడిచి మరలిపోయెను.

* "ఏతన్మహత్కర్మ కరోతి యో వై, కులేన రూపేణ బలేన యుక్తః, తస్యాద్య భార్యా భగినీ మమేయం, కృష్ణా భవిత్రీ న మృషా బ్రవీమి"
(భార. ఆది. స్వయంవరపర్వము. 186 అధ్యా. 37 శ్లోకము.)

"సర్వాన్ నృపాంస్తాన్ ప్రసమీక్ష్య కర్ణో ధనుర్ధరాణాం ప్రవరో జగామ, ఉద్ధృత్య తూర్ణం ధనురుద్యతం తత్, సజ్యం చకారాశు యుయోజ బాణాన్; దృష్ట్వా సూతం మేనిరే పాండుపుత్రాః, భిత్త్వానీతం లక్ష్యవరం ధరాయాం, ధనుర్ధరా రాగకృతప్రతిజ్ఞం, అత్యగ్నిసోమార్క మథార్కపుత్రం, దృష్ట్వా తు తం ద్రౌపదీ వాక్యముచ్చైః, జగాద నాహం వరయామి సూతం, సామర్ష హాసం ప్రసమీక్ష్య సూర్యం, తత్యాజ కర్ణ స్స్ఫురితం ధనుస్తత్." (భా. ఆది. స్వయంవర. 186 అధ్యా. 21 శ్లోకము మొదలు).



పిదప రాజు లెల్లరును నిరుత్సాహులై యూరకుండఁ బ్రాహ్మణవేషముతో నున్నయర్జునుఁడు లేచి సభారంగమున నిలిచి యావింటిని మోపెట్టి యాలక్ష్యమును దెగవేసెను. తోడనె పాంచాలరాజకుమారిక పూలమాలికతో నాతని కంఠము నలంకరించెను.

ఆసమయమున రాజులందఱును క్షత్రియునకుఁ గన్యనీయక విప్రునకిచ్చి క్షత్రియకులమునంతను నవమానించెనని కోపగించి ద్రుపదునిపైఁ గవియఁగా భీమార్జును లారాజలోకమునోడించి పాఱఁద్రోలిరి. ఆయుద్ధమునఁ గర్ణునిపై నర్జునుఁడు కవిసెను. గాని యాతఁడు బ్రాహ్మణుఁడనియు బ్రహ్మతేజము జయింపరాదనియు నెంచి యాకర్ణుఁడు యుద్ధమునుండి మరలి దుర్యోధనునిఁ దోడ్కొని వెడలిపోయెను.*

పిదపఁ బాండవులు తల్లికడ కేఁగి విలాసార్థముగ మే మొకభిక్షఁ దెచ్చితి మనఁగా నామె యెప్పటియట్లె మధుకరాన్నముం దెచ్చి రనుకొని యన్నదమ్ము లగుమీరందఱును బంచుకొని యుపయోగింపుఁ డని పలికెను. మాతృవాక్యపరిపాలకు లగుపాండవులు ద్రుపదు నెట్టకేలకు నియ్యకొలిపి యైదుగురును నాద్రౌపదిని బెండ్లియాడిరి.

ద్రౌపది కైదుగురు భర్తలగుటకుఁ గారణము కుంతివాక్యమేకాక కారణాంతరమును గలదు. పూర్వకాలమునం దాలా

* ఏవముక్తస్తు రాధేయో యుద్ధాత్కర్ణో న్యవర్తత,
బ్రాహ్మం తేజ స్తథాఽజయ్యం మన్యమానో మహారథః.
(భారత. ఆది. స్వయంవర. 190 అధ్యా. 22-23, శ్లోకములు).

యని నైన యిందిరసేన యను పరమపతివ్రత కర్మవశమునఁ గుష్ఠరోగి యగు మౌద్గల్యునకు భార్యయయి జన్మాంతరము నందుఁ గాశిరాజునకుఁ బుట్టి చిరకాలము వివాహములేక గొప్ప తపస్సు చేసి యీశ్వరుని మెప్పించి వరమును గోరుటలోఁ బతి శబ్దము నైదుమాఱులు పలికెను. ఈశ్వరుఁడును నామె కోరిన కోర్కి సిద్ధియగునట్లు వర మొసఁగెను. ఆకారణమున నామె ద్రౌపదియై జన్మించి పాండవు లైదుగురను భర్తలనుగాఁ బడసెను.

అట్లామె వరము కోరుటలోఁ బతి యనినైదుమాఱులు పలుకునపు డుచ్చారణస్వభావమున నైదుపర్యాయములు పతి శబ్దమును* నొకపకారమును నామెనోటనుండి వచ్చెననియు నా కారణముననె యామెకు శుల్క మగుమత్స్యయంత్రపుమథన విషయమున సమర్థుఁడై కుంతికిఁ బుత్రుఁడై కర్ణుఁడును శుల్కార్థమును నెఱవేర్చెననియు, నీకారణముననె ద్రౌపదికిని గర్ణునందును నభిప్రాయముండెననియు గాథలు గలవు. ఈగాథలఁ బండుపాట యనునొకపాట బలపఱుచుచున్నది.

"అర్జునుఁ డొకనాఁ డొకచెట్టున నాఱుయోజనముల మీఁదను వ్రేలుచున్నయొకపండును దునిమెను. ఆసమయమున శ్రీకృష్ణుఁడువచ్చి "అయ్యో యెంతపనిచేసితివి? ఈచెట్టున దినదినమును నొకపండు పండుచుండును. అది యొకఋషి కాహారము. దానిని నీవెఱుఁగక తెగనేసితివి. కాన నాఋషి

*అత్రిముత్తోఁ ద్వరగాఁ బతిశబ్ద మైనుమాఱులుచ్చరించిన ట్లుచ్చరించు నపుడైమపతిశబ్దము బనొకపకారముకాక మానదు; "పతిపతిపతిపతిపతిప"



శపింపఁగలఁడు. అయినను నే నొకయుపాయమును జెప్పెదను. మీరాఱుగురును, మీమనసులలోనున్న సత్యమైనయుద్దేశములను నామెదుట వెల్లడింపుఁడు. అట్లయిన నీపండు మరల నెప్పటి యట్లు వృక్షము నంటుకొనును" అని పలికెను. అప్పుడు వారు తమతమయుద్దేశములను వెల్లడించుటలో ద్రౌపది యిట్లనెను.

"పంచ మే పతయ స్సంతి మహ్యం షష్ఠోఽపి రోచతే"

"నా కయిదుగురు భర్తలు గలరు. ఆఱవవానియందు నభిరుచి గలదు" అను మొదలగునంశము లాపాటలో నున్నవి. మనవారు ప్రమాణములుగా గ్రహించుచున్నపురాణములందె పెక్కువిషయములు యుక్తిశూన్యములయి యుండఁగా నీపాట సయుక్తికముగా లేకుండుట యొకవింతకాదు; కాని యిందలి యంశములలోఁ బయి నుదాహరించిన ద్రౌపదీవాక్యములకు

"షష్ఠే త్వాం చ తథాకాలే ద్రౌప ద్యుపగమిష్యతి"

అను మహాభారతములోని శ్రీకృష్ణవాక్యము (భా. ఉద్యో. భగవద్యానపర్వ, 139 అధ్యా 15 శ్లో) సంవాదముగా నగపడుచున్నది. దీనిని దిక్కయజ్వ యిట్లు భాషాంతరీకరించి యున్నాఁడు.

క. "పాంచాలరాజపుత్త్రియు, నంచితముగ నిన్నుఁ బొందు నార్వురపయిఁ గ
పంచితపుణ్యుఁడ వీవొక, యించుకయును వేఱుసేయ కీతె మ్మెలమిన్."

(భారతము-ఉద్యోగపర్వము.)

పై నుదాహరించినపండుపాటలోఁ జెప్పఁబడినట్లు శ్రీకృష్ణుఁడు ద్రౌపదివల్ల నామెయభిప్రాయమును వినియే యుండకున్న నిట్లు పలుక సాహసించునా యని యందురు.

పాండవు లట్లు ద్రౌపదిని బెండ్లియాడి పాంచాలురకుఁ బరమాప్తులయి యున్నయపుడు ప్రబలులగు పాంచాలురసంబంధము నాలోచించి నీతివిశారదులగు భీష్మవిదురులయనుమతిని ననురోధించి యంతవఱకుఁ దానె పాండవులను లక్కయిండ్లఁ గాల్పించె నని వ్యాపించియున్నలోకాపవాదమును బాపికొనుటకుఁ గావలయు ధృతరాష్ట్రుఁడు వారిని రావించి ధర్మరాజున కర్ధరాజ్యము నిచ్చి విశ్వకర్మనిర్మిత మగునింద్రప్రస్థపురమును రాజధానిగాఁ జేసి పట్టాభిషేక మొనరించెను.

అట్టి పాండవు లింద్రప్రస్థముననున్నకాలమున నొకనాఁ డగ్ని దేవునిప్రార్థనమును మన్నించి యర్జునుఁ డింద్రునిఖాండవమనువనమును దహించునగ్నికి సహాయుఁ డయి యుండెను. అం డగ్ని దేవునిప్రార్థనమున వరుణుఁ డర్జునునకు గంధర్వజము లగు శ్వేతహయములను బూన్చినదివ్యమగు రథమును నక్షయతూణీరములను గాండీవమను దివ్యమగువిల్లును బ్రసాదించెను. ఆదహనమున నర్జునునిచేవిడువఁబడిన మయుఁ డను రాక్షసుఁ డొక యద్భుతమైన సభను గానుకగా నిచ్చెను. ఇంద్రుఁడు తనవనమును దహించునగ్నిని రక్షించుచున్న యర్జునునితోఁ బోరి యాతనిశక్తికి మెచ్చి యాతనికి నాగ్నేయవారుణాదిదివ్యాస్త్రముల నొసంగెను.

ఆహా! దైవానుకూల్యము నేమని చెప్పవచ్చును! దైవమనుకూలించునపుడు విషమును నమృత మగుచుండు టకు నందియ మున్నదా? తనయుద్యానవనమును దగులఁబెట్టిచిం



యనేకప్రాణికోటిమరణమునకు మూలకందమై తండ్రి యని యాలోచింపక తన్నెదిర్కొన్నయర్జునునకు నింద్రుఁ డనేక దివ్యాస్త్రముల నిచ్చెను. ఈఘోరకార్య మర్జునున కనేకశ్రేయస్సుల నొసంగుట యాతనియదృష్ట మహిమనుగాక వేఱొకదాన నగునా? కావుననే కదా విద్వాంసు లదృష్టచరంబైనను నదృష్టము గలదని యంగీకరించుచున్నారు.

ఆఖాండవదాహసమయమునఁ దక్షకతనయుఁడగునశ్వసేనుఁడు తనతల్లిం దోడ్కొని పాఱిపోవుచుండఁగా వారి నర్జునుఁడు గాండీవముతో మోది యాయగ్ని కాహుతి చేసెను. అపుడాయశ్వసేనునియూర్ధ్వకాయము మాత్రము పైకిఁదూలి పోయెను. ఆసర్పము పగఁబట్టి యర్జునవిరోధియగు కర్ణుని యొద్దకుఁ బోయి యుద్ధసమయమునఁ దన్ను నాగాస్త్రమంత్రావిష్టుఁ జేసి ప్రయోగించిన నర్జునుం దునిమెద నని చెప్పి యాతనిచేఁ బూజింపఁబడుచు నుండెను.

---

## ఐదవ ప్రకరణము.

### కర్ణుని పరాజయము.

కురుపాండవులమనస్పర్థలతోఁ గూడఁ గర్ణార్జునులపరస్పరజయాభిలాషయుఁ బెరుగుచుండెను. "స్పర్థయా వర్ధ

విద్యా" అను చొప్పునఁ గర్ణార్జునులు పరస్పరస్పర్థచే ధనుర్విద్యాభ్యాసమును దివ్యాస్త్రసంపాదనమును విసువులేక జరపుచునే యుండిరి.

దుర్యోధనునకుఁ గర్ణుఁడు మిత్రుఁడు కాకముందె కురుపాండవులకుఁ బరస్పరవైరమంకురించెను. కర్ణమైత్రికిఁ బూర్వమె దుర్యోధనుఁడు తన మేనమామ యగు శకుని ప్రేరణమునఁ బాండవులను జంప యత్నించుచుండెను. భీముని గంగలోఁ ద్రోయించుట పాములచేఁ గఱపించుట విషాన్నము పెట్టించుట మొదలగునవి కర్ణదుర్యోధనుల మైత్రికిఁ బూర్వమె జరుపఁబడినవి. అంతకంతకుఁ బ్రబలుచున్న ధర్మరాజునైశ్వర్యము నాతని రాజసూయయాగము మొదలగునవి దుర్యోధనుని మాత్సర్యలతకుఁ బ్రోఁకు లయ్యెను. మఱియు రాజసూయయాగమునకు ధర్మరాజుచే నాహూతుఁడై వెళ్లిన దుర్యోధనునకుఁ దమకుఁ మయుఁ డొసంగిన మాయసభను జూపి పాండవు లాతనిఁ బరాభవించిరి. దుర్యోధనుఁ డాసభలోని మాయల నంతకు ముందెఱుఁగనివాఁ డగుట జలములేనిచోటులందును నగపడు జలముం గని కట్టుబట్ట లెగఁబెట్టియు, జలయుతప్రదేశములును నిర్జలస్థలంబులరీతి నగపడుటచేఁ గట్టుబట్టలఁ దడుపుకొనియు, ద్వారములేనిచోటను నగపడుద్వారములం జూచి యందుఁ బ్రవేశింపఁ బోయి గాయపడియు నిట్లనేకవిధములుగాఁ బరిహాసనీయుఁ డయ్యెను. ఇంతియకాక ద్రౌపదియు నప్పుడు [illegible]ను జూచుచుండఁగా నాతనిం జూచి నవ్వి యాతనిమనసు నొ



ప్పించెను. మానవంతులలో మొదటివాఁడును, నంతకుముందె పాండవుల వైభవమునకు మత్సరించువాఁడును మహాబలసంపన్నుఁడు నగు మహారాజపుత్త్రుఁ డట్టితిరస్కారమును సహించునా!

దుర్యోధనుఁ డట్లు తిరస్కరింపఁబడి యింటి కేఁగి తన మనోదుఃఖమును దండ్రితోడను మేనమామతోడను మిత్త్రుఁడగు కర్ణునితోడను జెప్పి పరితపించెను. ఎట్లయినను బాండవుల సిరిని దొలఁగించినఁగాని జీవింపఁ జాల నని పట్టుపట్టియుండెను. ధృతరాష్ట్రుఁడు పెక్కువిధముల మరలింపఁజూచియు విఫలమనోరథుఁడయ్యెను. క్షత్త్రియోచిత మగు బాహుబలమున వారి నోడించి యేకచ్ఛత్రముగ రాజ్యమనుభవింపుమనియు నేనొక్కరుండనె పాండవుల ననాయాసముగ జయించెద ననియుఁ గర్ణుఁడు మహావీరపురుషోచితముగఁ బలికెను గాని యది తక్కినవారికి రుచింపదయ్యె. అప్పుడు దుర్యోధనునకు మేనమామయు సొగటాలనాడుటలో నసమానుఁడును నగు శకుని తనయక్షవిద్యానైపుణ్యమునఁ బాచికలాటయం దత్యాసక్తి గలధర్మరాజు నోడించి యాతని వైభవము నెల్ల నీకొసంగెద ననిచెప్పఁగా నాసభికు లాయాలోచనమునె స్థిరపఱిచిరి.

ఆయాలోచనముచొప్పున జరుపఁబడిన యాపాచికలమాటలో శకుని ధర్మరాజు వైభవమునె గాక యాతనిని సోదరభార్యాసహితముగా గెలుచుకొనెను. శకుని యాడుటలో ద్రవ్యలాభనష్టముల నెల్లను దుర్యోధనుఁడె వహించుటకు నిర్ణయించుకొని యుండుటచేఁ బాండవులు దుర్యోధనునకు ద్యూత

దాసులయిరి. అట్లు గెలుచుకొని యూరకుండక దుర్యోధనుఁడు తన పగఁదీర్చుకొనుటకుఁ దలఁచి ద్రౌపదిని సభకు రావించి పాండవులు చూచుచుండఁగ నామె కట్టు పట్టముల నొలువ దుశ్శాసనుని నియోగించి యామెను దనతొడపైఁ గూర్చుండుమని సంజ్ఞ చేసెను. ఎట్టి క్రూరకార్యములు చేసినను లోకము సహించును గాని స్త్రీల నవమానించుటకు మాత్ర మించుకంతయు సహింపదు. అందును మహారాజపుత్త్రికయు మహారాజపత్నియు నగు ద్రౌపదిని ద్యూతములో గెలుచుకొన్నమాత్రమున నట్లు పరాభవించుట దుర్యోధనునకు గొప్పతప్పిద మనుటకు సందేహము లేదు. దాసియైనను నట్లుచేయుటయందుఁ బ్రభువునకు హక్కు లేదు. కావుననే యాకార్య మప్పటికిని నిప్పటికిని నెల్లవారికి దుశ్శ్రవమై దుస్సహమై యున్నది. మానాంధుఁడును క్రోధాంధుఁడును నయి దుర్యోధనుఁ డిట్టి కార్యమును జేయుటం బట్టియే రాజ్యస్వత్వవిషయమున నించుకేనియు హక్కు లేని పాండవులపక్షమున లోకము చేరియున్నది. ఇట్టిపొరపాటు దుర్యోధనుఁడు చేయుటచేతనే ధృతరాష్ట్రుఁడు పాండవుల కర్ధరాజ్య మిచ్చినసౌమ్యతయంతయు బూడిదలోఁ బోసినపన్నీరయ్యెను.

స్వామిభక్తులకుఁ దమయధీశులవ్యాపారములలోని మంచిచెడ్డలను విమర్శించుట లక్షణము కాకుండుటచేతఁ గావలయును గర్ణుఁ డిట్టివిషయమున నమ్మహాసభలో దుర్యోధనుని వ్యాపారమున నేవగింపక యాతని కనుకూలముగాఁ బ్రసంగించి మహా



విపద్దశలో నున్న యాద్రౌపది నుల్లసము లాడెను. అప్పుడు సభవారు ద్రౌపది నట్లుచేయుట యనుచితమని యేవగింపఁగా నైదుగురకు భార్యయగుటచే నామె బంధకియనియు నట్టిదాని నట్లు చేయుట యనుచితము కానేరదనియు నాతఁడు ప్రసంగించెను. మఱియు ధర్మరాజు తనోడినపిదప ద్రౌపది నోడెను గాన ద్రౌపదిగెలుపు చెల్లనేరదను ప్రశ్నము రాఁగా ధర్మరాజాదులందఱును దాసులైనపుడు వారిసొత్తగు ద్రౌపదియు దాసియగుట వింత కానేరదని సమాధానమును జెప్పెను. ఈసమాధానము మాత్రము కొంతవఱకు సయుక్తికముగానున్నను నీశ్వరప్రసాదవశమున నైదుగురుభర్తల నందినట్టియు, ననేకజన్మముల నుండియు మహాపతివ్రతయై యున్నట్టియు ద్రౌపదిని బంధకియనుట యుచితముగా నుండలేదు.

కర్ణుఁడు నిజమైనస్వామిభక్తుఁడే యైనను, దా నాడిన మాటలలోఁ గొంత యుక్తి యున్నను, గురుపాండవుల వివాదమునకు మూలమగు రాజ్యాంశమునందలిహక్కు పాండవులకు లేకుండుటయే నిశ్చయమైనను, పాండవులచేతను ద్రౌపదిచేతను దనప్రభువగు దుర్యోధనుఁ డక్రమముగాఁ బరాభూతుఁడగుట దుస్సహమే యైనను, వేఱువిధముగఁ బాండవులఁ బరిభవింప నగునుగాని మహావిపద్దశలో నున్న పతివ్రతయగు ద్రౌపది నట్లుల్లసములాడుట మాత్రము తప్పు గాకపోదు. మహాదాతయు నిత్యసత్యవ్రతుఁడును ధర్మాత్ముఁడును దపశ్శాలియు నౌచిత్యసంపన్నుఁడును నగుకర్ణుఁ డిట్టియనుచితకార్య

మును జేయుట యద్భుతముగా నున్నది. అద్భుతమన నేల? ఈశ్వరప్రపంచములో నెవ్వనిచరిత్రమును నిష్కళంకమయి యుండఁజాల దనుట నిర్వివాదాంశము. పాండవులసిరి నపహరించుటకుఁ జేసిన యాలోచనములలో వీరపురుషోచితముగ బాహుబలమునఁ బాండవుల నోడుచుటయె యుక్తమని పలుమాఱుబోధించినను గర్ణుఁడు కొన్నిసమయములందుఁ గపటోపాయములను బన్నుశకునిప్రభృతులతో నేకీభవించుచుండుటయుఁ గలదుగదా!

దుర్యోధనుఁడు చేసినయిట్టిఘోరకార్యమునకు లోకమంతయునేవగింపఁగా నట్టినిందనుదొలఁగించుకొనుటకుధృతరాష్ట్రుఁడుపాండవులకు వారిరాజ్యమునిచ్చివేసెను. పిమ్మటధర్మరాజు మరల ననుద్యూతమున నోడి యందునొడ్డుగా మరల నిర్ణయించుకొన్న "పండ్రెండేండ్లరణ్యావాసమును నొకయేఁడజ్ఞాతవాసమును నిర్విఘ్నముగఁజేయుట" అను సమయమును నెఱవేర్చుటకయి సపరివారముగనడవికిఁబోయెను. ఆసమయమునవారియాపదలకు మిక్కిలిగవగచితత్పితామహుఁడగు వేదవ్యాసుఁడచటికి వచ్చి కర్ణాదులనుజయింపఁజాలుప్రాభవముగల్గుటకై యర్జునున కొకదివ్యమంత్రము నుపదేశించి దానితోఁ దప మాచరింపుమని చెప్పెను. అర్జునుఁడును నాతనియాజ్ఞ చొప్పున నింద్రకీలపర్వతమునకుఁబోయి యామంత్రముతో ఘోరమగుతపమునరించి యీశ్వరునిమెప్పించి యమోఘమగుపాశుపతమను దివ్యాస్త్రమును



సంపాదించెను. మఱియు నాతనితపమునకు మెచ్చి యింద్రుఁడు దేవగణములతోఁ బ్రత్యక్షమయి యనేకదివ్యాస్త్రముల నొసంగెను.

పాండవులు దుష్కరమగు నాసమయమును నెఱవేర్పలేక యడవులలో నుండి మరల రాఁజాల రని నమ్మికొనియు భీష్మద్రోణకర్ణాదులయజయ్యపరాక్రమమును దలఁచియు దుర్యోధనుఁడు నిశ్చింతముగను బ్రజారంజకముగను రాజ్యము నేలుకొనుచు సుఖముగా నుండెను. ఎప్పుడైనను సంపూర్ణాభివృద్ధి నొంది నిరంకుశముగ రాజ్యము నేలుకొనువా రేమఱచియుఁ దమ్మెవ్వ రెదిరింపఁగలుగుదు రని గర్వించియు నుండుటసహజమె గదా! అట్లె రాజ్యము గోలుపోయినవారును రాజ్యమును విరివి నొందింపఁ దలఁచువారును నిరంతరప్రయత్నములను జేయుచుండుటయు స్వభావసిద్ధమె. అట్టివారియుత్సాహశక్తియె వారికిఁ గార్యసిద్ధి నొడఁగూర్చుచుండును.

ఒకానొకప్పుడు "అరణ్యావాసముఁ జేయుచున్న పాండవులకును ద్రౌపదికిని నీవైభవమును జూపి మయసభాదర్శనము నాఁటియవమానమునకుఁ బ్రతికారముఁజేసి విఱ్ఱవీఁగుటకంటె నీకుఁ గృతార్థత వేఱుగలేదు" అని కర్ణుఁడు దుర్యోధనున కుపదేశించెను. ఇదియునుబయినుదాహరించిన రాజభక్తిమొదలగు కారణములచేతనే కర్ణునిచేఁ జేయఁబడియుండును; కాని కర్ణునివంటి మహాపురుషుఁ డిట్లుపదేశించుట యనుచితముగా నున్నది. ఈపాపము కట్టి కుడుపుటచేతనె కావలయు నీసందర్భ

ములోఁ గర్ణునకుఁ దగనియోటమి సంభవించి యాచంద్రతారకముగ నాతనికీర్తిశరీరమునకుఁ బాయనికళంకమైయున్నది.

దుర్యోధనుఁడును గర్ణాదులు చెప్పిన యిట్టియాలోచనమునకు మిక్కిలి సంతోషించి ద్వైతవనమ్ములో మేఁతకై యుంపఁబడిన తమపసులను గొల్లపల్లెలను (ఘోషములు) జూచునెపము కల్పించుకొని ధృతరాష్ట్రుని సెలవు గైకొని యంతఃపురస్త్రీలతోడను శకునికర్ణప్రభృతిబంధుమిత్రులతోడను గలసి మహావైభవముతో ద్వైతవనమునకు విజయము చేసెను. అప్పు డర్జునునితండ్రియుఁ బాండవపక్షపాతియు నగు నింద్రుఁడు కోపించి దుర్యోధను నంతఃపురస్త్రీలతోఁ గట్టి తెండని నియోగించి మహాబలసంపన్నులగు చిత్రసేనాదిగంధర్వుల నంపెను.

ఆయరణ్యమున జలక్రీడ చేయఁగోరి యొకకొలనికివచ్చు దుర్యోధను నడ్డి యాగంధర్వులు వివాదమును గల్పించుకొని కౌరవులతో యుద్ధము చేయఁదొడఁగిరి. అమ్మహాయుద్ధమునఁ గర్ణుఁడు వేలకొలఁదిగంధర్వులను వధించి యామహాసైన్యమును జించి చెండాడఁగా నాసేనలవారు తమయధిపతియగు చిత్రసేనునిమఱువుఁ జొచ్చిరి. చిత్రసేనుఁడును బ్రత్యక్షముగాఁ గర్ణునెదుట నిలువఁజాలక యంతర్ధానము నొంది మాయాయుద్ధమును జేయఁ దొడఁగెను. ఆమాయాయుద్ధమున దొమ్మిగ గంధర్వు లొక్కపెట్టున మీఁదఁబడి యుద్ధముచేసినందునఁ గాలకర్మవశమునఁ గర్ణుఁడు విరథుఁడై యోడి పాఱిపోవుచున్న వికర్ణునిరథముపై నెక్కి యుద్ధభూమి నుండి తొలఁగిపోయెను.



అట్టిసమయమున గంధర్వులు దుర్యోధనునిబట్టి కట్టి యింద్రుని యొద్దకుఁ దీసికొని పోవుచుండిరి. అపుడీవృత్తాంతమును దుర్యోధనానుచరులవలన విని ధర్మరాజు దుర్యోధనుని విడిపింపఁదన సోదరుల నంపెను.

ఈసందర్భమున భీమసేనుఁడు "కాఁగలకార్యము గంధర్వులుచేసిరి. కాన నాతని విడిపింపనేల!" అని వాదింపఁగా లోకజ్ఞాన సంపన్నుఁడగు ధర్మరా జతని నివారించెను. అట్లు ధర్మరాజుచే నియోగింపఁబడి భీమాదులు నలుగురును బోయి గంధర్వుల నెదిరించి యోడించిరి. కర్ణాదిమహావీరులను జయించుటకయి యింద్రునిచేఁ బంపఁబడినగంధర్వులు మహాబలశాలు లయియే యుందు రనుటకు సందేహములేదు. ఈసందర్భమునఁ గర్ణునిజయించిన గంధర్వుల నర్జునుఁడు జయించుటచేఁ గర్ణునకంటె నర్జునుఁ డధికుఁ డని చెప్పవలసియున్నను నింద్రుఁడు గంధర్వుల నంపునపుడు *అర్జునుఁడు రక్షింపఁదగినవాఁ డని వారికిఁ జెప్పియున్నందున గంధర్వు లర్జునవిషయమున సరిగాఁ దమబలమునుజూపి యుద్ధమునుజేసి రని చెప్పుటకు సందేహింపవలసియున్నది.

పైరీతిని బాండవులకోడుటచేగంధర్వులు దుర్యోధనుని దెచ్చిధర్మరాజునకర్పించిరి. అర్పించి "మిమ్ముఁబరాభవించుటకై

---

*"గచ్ఛ దుర్యోధనం బద్ధ్వా సహామాత్య మిహానయ,
ధనంజయశ్చ తే రక్ష్యః సహ భ్రాతృభి రాహవే.
స నః ప్రియః సఖా తుభ్యం శిష్యశ్చ తవ పాండవః."
(వనపర్వము, ఘోషయాత్రాపర్వము, 247-అధ్యాయము.)

వచ్చిన యాదుష్టునిగర్వ మడఁచుట కింద్రుఁడు నియోగించినందున మేము వీని నిట్లు పట్టి బంధించితిమి" అని విన్నవించి వెడలిపోయిరి.

ధర్మరాజును దుర్యోధనునకు బుద్ధిచెప్పి యింటికిఁ బొమ్మనెనుగాని యాతఁ డచ్చట నుండి దైన్యముతోఁ బోయి యింటికిఁ బోవనొల్లక దురంతమగు విషాదముతోఁ బరితపించుచుఁ బరాభవదూషితమగు జీవితమును కేవగించి యాయరణ్యమందె ప్రాయోపవేశమున శరీరమును విడువ నిశ్చయించుకొనెను.

---

## ఆఱవప్రకరణము.

—కర్ణునిదిగ్విజయము—

పాండవులను బరాభవించి తనవైభవమును జూపఁ బోయిన దుర్యోధనునకు గంధర్వులతోనోడుటకంటెఁ బాండవులు తన్నా గంధర్వుల బారినుండి రక్షించుటయె దుర్భరమగుపరాభవమయ్యెను. ధర్మరాజు దుర్యోధనునకుఁ జేసినది మహోపకారమే యనఁదగియున్నను నది మానవంతులలో నగ్రగణ్యుఁడగు దుర్యోధనునకు మహాపకార మయ్యెను. గంధర్వుల బారినుండితప్పించి యుపకారముచేసిన ధర్మరాజునకుఁ దోడనె రాజ్యభాగమిచ్చి దుర్యోధనుఁడు కృతజ్ఞతను జూపుట యుచితమని సామాన్యముగఁ దోఁచును గాని లౌకికుఁడగు ధర్మరాజు చేసిన యాసందర్భములోని యుపకారము మహావమానియగు



దుర్యోధనునకు దురంతమగు వైరమును గలిగించుటయు వింతకాదు. మానవంతుఁడగు పురుషునకు దైవవశమున దైన్యస్థితిగలిగినప్పుడు విరోధిచేయుయుపకార మపకారశతముకన్న నధికమగుట యనుభవవిరుద్ధము కానేరదు. కావుననే లోకజ్ఞుఁడగుధర్మజుఁడు చేసినయుపకారము దుర్యోధనున కాత్మహత్యచేసికొనవలసినంత యావశ్యకతను సంఘటించెను.

ఇట్టి గొప్పయావద దుర్యోధనునకు సంభవించుటలోఁ గర్ణుఁడె మూలకారణమై యుండెను గదా. నిజమైన స్వామిభక్తి గలవానికింతకంటె దురంతమగు దుఃఖము వేఱొకటియుండునా! తనచే జయింపఁదగినవా రనుకొనుచున్న పాండవులు, తన్ను జయించినగంధర్వుల నోడించుటకంటె నవమానము వేఱొకటి లేదని చెప్పవచ్చును. ఎన్నెన్నో మాయోపాయములను బన్ని యెన్నెన్నో యనుచితకార్యముల నెంతెంతయో చేసినఁ గాని జయింపరానికర్ణుఁ డిట్లు పాండవులచే జయింపఁబడిన గంధర్వుల కోడుట నరయఁగా యుద్ధమునందలి జయాపజయములు కాకతాళీయములని స్ఫురింపకపోదు. అర్జునుఁడును నొకప్పుడు కర్ణుని తేజమున కోహటించి "జీవన్ భద్రాణి పశ్యతి" అని పలుకుచు యుద్ధభూమినుండి తొలఁగిపోయెను గాదె! (చూడుఁడు- 10 ప్రకరణము)

ఇట్టియవమానమున కోర్చి తమగర్వభంగమునకు సంతసించు కురువృద్ధుల మోములు చూచుచు జీవించుటకంటెఁ గర్ణదుర్యోధనులకుఁ బ్రాణత్యాగమె యుచితమని చెప్పవచ్చును;

కాని యాకల్పమును జీవింపక తీరని వారికీర్తిశరీరములకు సంభవించిన యీమాలిన్యమును దేశపరిదర్శనమున సాధ్యమగు నంతవఱకైనఁ దుడిచి ప్రకాశింపఁ జేయుటయు నావఱకు నిష్కళంకమై యున్న శత్రువులకీర్తిశరీరమునకు సాధ్యమగునంతవఱకు మాలిన్యమును గూర్చుటయు వారికిఁ గర్తవ్యములు కాక పోవు.

కావుననే ధైర్యశాలియగు కర్ణుఁడును దనంతనె యీఱడిల్లి తనప్రభువగు దుర్యోధను ననేకవిధముల నూఱడింపఁ బోయెను; గాని మహామానియగు దుర్యోధనునిపట్ల నాతని ప్రయత్నములు సఫలములు కాఁజాల వయ్యెను. ఇట్లు ప్రాణత్యాగమునకుఁ గృతనిశ్చయుఁడై ప్రాయోపవిష్టుఁడై దుర్యోధనుఁడుండఁగాఁ బాండవపక్షపాతియగు దేవేంద్రునిపై మత్సరించి దుర్యోధనున కుపకృతి చేయఁగోరి రాక్షసు లాతనిం బాతాళమునకుఁ గొనిపోయిరి. కొనిపోయి యచ్చట నతని నూరార్చి "మేమందఱమును నీపక్షపువీరులయం దావేశించి పాండవుల వధించి నీమనశ్శల్యమూడఁ బెఱికెదము. కర్ణునందు నరకాసురసంశముప్రవేశించి యర్జును నోడింపఁగలఁడు" అనిచెప్పి యాతని మరల నెప్పటిచోట నుంచిరి. దుర్యోధనుఁడు నిద్రలేచి కల[illegible]సిల్లునీవృత్తాంతమునఁ గొంత యూఱడిల్లియుండఁగా [illegible]డు "ద్వైతవనమునవచ్చినయీనాపరాజయమునుగణింపవలదు. [illegible] మూఁడవయేఁడుగడచి పాండవులు వచ్చినతోడనె యర్జును నోడించెదను" అనిచెప్పి విల్లుముట్టిప్రమాణము చేసి యూఱార్చెను.



అప్పుడు రాక్షసుల యుపదేశమును గర్ణుని ప్రతిజ్ఞయు మరల నాశాలతను గొనసాగింప దుర్యోధనుఁ డెట్టకేల కూఱటగాంచి పరిభవఖిన్నమగు ముఖముతోఁ గరిపురమునకుఁ బోయెను.

పై ఘోషయాత్రావృత్తాంతము చారులవలన విని భీష్ముఁడు కర్ణదుర్యోధనులను హృదయశల్యముగా నెత్తిపొడిచి పీడించెను. అప్పుడు దుర్యోధనుఁడు కర్ణునివైపు చూచి వెడవెడ నవ్వుచు నచ్చటనుండి తొలఁగిపోయెను.

భీష్ముఁడు చేసినయీపరాభవము కర్ణునిదే కాని దుర్యోధనునిది గాదని వేఱుగఁ జెప్పనక్కఱలేదుకదా! ఇట్టిపరాభవములు కర్ణున కపకారములు గాక యుపకారములే యయ్యెనని చెప్పవచ్చును. హృదయభేదకములగు నిట్టియవమానములు గలిగినం గాని యెవ్వరును దమతమసంపూర్ణశక్తులను జూపఁజాలరు. కావునఁ గర్ణునకును దురంతమగు నీపరాభవములచేఁ గన్నులనిండఁ గోపము వచ్చి దిగ్విజయముం జేసి వాసిగాంచు నుత్సాహముప్పతిల్లెను. అట్టియుత్సాహమును నెఱవేర్పఁదలఁచి కర్ణుఁడు దుర్యోధనానుమతిని గోరి యిట్లు ప్రసంగించెను.

"మిత్రరత్నమా! యుద్ధములందుజయపరాజయములనియ[illegible]కావా? యుద్ధసంప్రదాయము లెఱుఁగక యీముదుసలి [illegible] కింత వగవనేల? కాలకర్మవశమున నల్పులును నధికులను [illegible]గెలుచుట సంభవించును. అంతమాత్రమున నది యొక సం[illegible]సికొని యీముదుసలి కేవలమాత్సర్యముతో నిట్లు ప్రేలుట యుచితమా? ఈముదుకఁడు పలుమాఱు పాండవులను బొగడుచు మనల నిరసించుచుండును. ధర్మరాజుతమ్ములు

నలుగురును గలిసి యెంతో ప్రయత్నముచేసి శ్రీకృష్ణునిసాహాయ్యమునఁ జేసినదిగ్విజయము నే నొక్కరుఁడనె యొనర్చి మత్పరులగు నీభీష్మాదులనోరు మూసి నీమనశ్శల్యమును బెకలించి పాండవులహృదయములందు విషాదశల్యముల నెలకొల్పెదను. నీవును నిస్సపత్నముగ నీధరావలయము నెల్లను బరిపాలింపుము." అనిన విని దుర్యోధనుఁడు మిగుల సంతసించి "మిత్రశేఖరా! నేను ధన్యుఁడ నయితి. నీవంటి మహాపురుషుఁ డిట్లు మిత్రుఁడు ననురక్తుఁడు నయియుండ నాకేమి లభింపకుండును?" అని పలికి మన్నించి కర్ణునిదిగ్విజయయాత్ర కనుమతించెను.

కర్ణుఁ డట్లు రారాజుచే బహూకరింపఁబడి దిగ్విజయమునకు బయలువెడలి యప్పటికిఁ గురుదేశములకు 'పక్కలోని బల్లె' మయి యున్నట్టియుఁ బాండవులకుఁ బరమాప్తుఁడయినట్టియు గురుదక్షిణాసమయమునఁ దనకజయ్యుఁ డయి వాసిగాంచినట్టియు ద్రుపదునిపురమును మొట్టమొదట ముట్టడించెను. మహాబలసంపన్నుఁ డగు ద్రుపదుఁడును నెదిరించి కర్ణుని తేజమున కోహటించి యోడి ధనకనకరత్నవస్తువాహనాదులను బన్నులుగాఁ జెల్లించెను. ఇట్లు ద్రుపదుఁడును దనతనిసామంతరాజులును వశపడినపిదప నింద్రమిత్రుఁడగు భగదత్తునిప్రాగ్జ్యోతిషపురము నరికట్టెను. భగదత్తుఁడును గొప్పయుద్ధముఁ జేసి యోటువడి పన్నులు చెల్లించెను.

పిమ్మటహిమవత్పర్వతము నెక్కి యచ్చటి దేశముల నెల్ల జయించి యారాజులనుండి పెక్కుధనములు కానుకగా నందు



కొని తూర్పుదిక్కును జయింపనేఁగి వంగమగధాదిదేశముల నెల్ల జయించి యారాజుల నరిగాఁపుల నొనరించెను.*పిమ్మటదక్షిణా

*కర్ణుని దిగ్విజయవృత్తాంత మరణ్యపర్వములోని ఘోషయాత్రాపర్వమునందు రెండువందలయేఁబదిమూఁడవయధ్యాయమెల్లను వర్ణించుచున్నది. గ్రంథవిస్తరభీతిచే నదియెల్లనుదాహరింపనైతిని; కాని కొన్ని ముఖ్యములగుశ్లోకముల నుదాహరించుచున్నాను. "ఏవం స పృథివీం సర్వాం వశేకృత్వా మహారథః, విజిత్య పురుషవ్యాఘ్రో నాగసాహ్వయ మాగమత్. ఏవం విజిత్య రాజేంద్ర కర్ణశ్శస్త్రభృతాం వరః, సపర్వతవనాకాశాం ససముద్రాం సనిష్కుటాం. దేశైరుచ్చావచైః పూర్ణాం పత్తనైర్నగరై రపి, ద్వీపైశ్చానూపసంపూర్ణైః పృథివీం పృథివీపతే, కాలేన నాతిదీర్ఘేణ వశేకృత్వాతు పార్థివాన్ అక్షయం ధన మాదాయ సూతజో నృప మభ్యయాత్."

ఈయధ్యాయము కొన్నిప్రతులలో లేదని ముద్రణకర్తలచే వ్రాయఁబడియున్నది. కాని యన్నిప్రతులయందును బైయంశములను సూచించుశ్లోకములు కర్ణపర్వమునందును భీష్మద్రోణపర్వములందును నగపడుచున్నవి. (చూ-ఉపోద్ఘాతము.7-8 పుట) కర్ణునిమరణమును వినిధృతరాష్ట్రుఁడు శోకించుచుఁ గర్ణునిచరిత్రములను స్మరించుసందర్భములోనిశ్లోకము లీక్రింద నుదాహరింపఁబడుచున్నవి. "యోఽజయత్సర్వకాంభోజా నవంత్యాన్ కేకయైస్సహ, గాంధారాన్ మద్రకాన్ మత్స్యాన్ త్రిగర్తాం స్తంగణాన్ శకాన్ పాంచాలాంశ్చ విదేహాంశ్చ కుళిందాన్ కాశికోసలాన్, సుహ్మానంగాంశ్చ వంగాంశ్చ నిషాదాన్ పుండ్రకీచకాన్. వత్సాన్ కళింగాన్ దరదా నశ్మకా నృషికానపి, శబరాన్ పరహూణాంశ్చ ప్రహూణాన్ సరశానపి. మ్లేచ్ఛరాష్ట్రాధిపాం శ్చైవ దుర్గా నాటవికాం స్తథా జిత్వైతాన్ సమరే వీరః ప్రశస్తైః కంకపత్రిభిః. కరమాహారయామాస జిత్వా సర్వానరీంస్తథా... దివ్యాస్త్రవిన్మహాతేజాః కర్ణో వైకర్తనో వృషః, దుర్యోధనస్య వృద్ధ్యర్థం కృత్స్నా ముర్వీ మథాజయత్. యం లబ్ధ్వా మాగధో రాజా సాన్త్వమానో ఽగ్ర

దేశములపై దాడివెడలి విదర్భచేదిపాలకులగు రుక్మిశిశుపాల తనయులను జయించి పాండ్యకేరళాది దేశాధిపతుల నెల్ల వశపఱచుకొని యవంతినాథు నోడించి వారివారినుండి కరములను గైకొనెను. తరువాత దుర్యోధనునకు గురువగు బలరాముని సంబంధమున మిత్రులగు వృష్ణివరులను సామోపాయమున వశపఱచుకొని పశ్చిమదిగ్విజయయాత్రకు నారంభించెను. ఆరంభించి

---

సౌహృదైః, అరాత్సీత్ పార్థివంక్షత్రంబుతేయాదవకౌరవాన్" (కర్ణపర్వ 5 అధ్యా. 28 శ్లో. చూ.)

ఈరీతి గానన్ని ప్రతులందును నుండుటచేత వనపర్వములోని కర్ణదిగ్విజయాధ్యాయ మెవ్వరో యర్జునపక్షపాతులు కొన్నిప్రతులలోఁ దీసివేసి యుందురని తోఁచుచున్నది.

ఆంధ్రభారతమునందు నరణ్యపర్వములోఁ గర్ణదిగ్విజయవిషయ మగపడదు. ఒకపక్షమున నెఱ్ఱాప్రెగడకు దొరకినసంస్కృతమాతృకయందును బయిఅధ్యాయము పయి నుదాహరించినచొప్పున లేకుండియుండునని చెప్పవచ్చును. కాని కర్ణపర్వములో నన్నిప్రతులయందును గల పైశ్లోకమును దిక్కనయజ్వ పూర్తిగాఁ దెనిఁగింపకుండుటకుఁ గారణము తెలియకున్నది.

తిక్కనయజ్వకు దొరకినసంస్కృతమాతృకలయందును బయిపద్యములు లేవేమో యని సందేహించుటకును నవకాశములేదు. "వైదేహకాంభోజాదిపను దేశులెవ్వనికడిమిసొంపున నరిగాఁపులైరి" (భార. కర్ణ. ఆ 2 పద్య) అని యొకసీసచరణము కర్ణుని దలఁచుకొని ధృతరాష్ట్రుఁడు దుఃఖించుచుచెప్పుటను నగపడుచున్నది. ఇట్లే కర్ణపర్వమునందును భీష్మద్రోణపర్వములందును సంస్కృతమాతృకలయందును నగపడుచున్న కర్ణపరాక్రమసూచకములగు పెక్కుశ్లోకములు తిక్కనయజ్వ యాంధ్రీకరించి ప్రకాశపఱుపఁడయ్యె. అయ్యవి యాయాసందర్భములందుఁ జూపుచున్నాను.



యచట నున్న రాజలోకము నెల్ల జయించి మాళవ యవన శకముల నోడించి నగ్నజిత్ప్రముఖు లగుమహారథులను నిర్జించి వారివారినుండి కప్పములు గైకొనెను. ఇట్లు నలుదిక్కులనుండు రాజులను నారణ్యకులను జయించి యసంఖ్యమగు ధనమును సంగ్రహించి హస్తినాపురిని సమీపింపఁగా దుర్యోధనుఁడు చారులవలన నింతయుఁ దెలిసికొని యెదురేఁగి సంభ్రమగౌరవవినయములు ముప్పిరిగొన నాతనిఁ గౌఁగిలించుకొని సన్మానించెను. "అసహాయశూరుఁడవగు నో మిత్రరత్నమా! నీవుచేసినమహాకార్య మెవ్వరును జేసియుండలేరు. పాండవులు నీకుఁ బదునాఱవవాసికయిన రాఁజాలరు. నీవల్ల నాకుఁగలుగునుపకారము భీష్మునివలనఁగాని ద్రోణునివలనఁగాని కృపబాహ్లికులవలనఁగాని గలుగఁజాలదు. వేయేల! మహావీరుఁడవగు నీవలన నేను సనాథుఁడనైతి" అని యత్యాదరముతో రారాజు బహూకరించి ధృతరాష్ట్రగాంధారులను దర్శింపుమని యాతనితోఁ విన్నవించెను. కర్ణుఁడును దనచే జయింపఁబడిన సకలపర్వతారణ్యపట్టణగ్రామద్వీపజలధిసహిత మగు నబ్ధిమేఖల నెల్ల దుర్యోధనునకు సమర్పించి పరార్థ్యోత్తర మగు ధనము నుపాయనముగఁ జేసి ధృతరాష్ట్రగాంధారుల పాదములకుఁ బుత్త్రునివలె నమస్కరించెను. ధృతరాష్ట్రుఁడు సప్రేమబహుమానముగఁ బుత్త్రవాత్సల్యముతో నాతని నాలింగనము చేసికొని యానందించెను.

అదిమొదలుగ దుర్యోధనుఁడు నాతనిబంధుమిత్రులును గర్ణునిచేఁ బాండవు లనాయాసముగ జయింపఁబడుదు రని విశ్వా

సించియుండిరి. అప్పుడు పాండవపక్షపాతుల సమూహమున హాహాకార ముప్పతిల్లెను.

దుర్యోధనుఁడును గర్ణసమర్పితమైనయనంతమగు ద్రవ్యముతో ధర్మరాజు చేసిన రాజసూయము ధిక్కరించునట్టి వైష్ణవమను మహాయజ్ఞమును జేసి దిగంతవిశ్రాంతమగు కీర్తిని బడసి మహావైభవముతో భూవలయమును బరిపాలించుచుండెను. మఱియుఁ గర్ణునిమూలమున బాండవులను జయించి రాజసూయయాగమును జేయుటకై బరీక్షించుచుండెను.

---

## ఏడవప్రకరణము.

—♦ కర్ణునియౌదార్యము ♦—

కర్ణుఁడు దిగ్విజయము చేసి మిత్త్రుఁడగు దుర్యోధనునకు మనశ్శల్యమయి యున్న ఘోషయాత్త్రాపరిభవమును మఱపించి నిత్యసత్యవ్రతుఁడై మహాదాతయై సూర్యోపాసకుఁడై పవిత్రమును శ్లాఘ్యమును నగు చరిత్రముతోఁ గాలమును గడపుచుండెను.

కర్ణుఁడు మహాదాతయని నిర్ణయించుటకు నిప్పటికిని బ్రసిద్ధమయియున్న 'దానకర్ణుఁడు' అనులోకోక్తియే చాలియున్నది. మఱియు సమస్తకవిలోకమును దాతలను వర్ణించునపుడు కర్ణునుపమానవస్తువుగ గ్రహించుచుండుటయు సుప్రసిద్ధము. కర్ణుని



దాతృత్వమునుగుఱించి యొకకథ కలదు. దాని నిచ్చట వ్రాయుచున్నాను. కర్ణుఁడు మహాదాతయై దానఘంటనొకటిని దనయింటిముంగిటను గట్టించెను. యాచకుఁడెవ్వఁడేనివచ్చి యాఘంటనువాయించినతోడనే తానెట్టి యవసరమున నున్నను వచ్చియాతనిమనోరథమును బూరించుచుండెను. దుర్యోధనుఁ డదిచూచి తనసామంతరాజే యట్లు సేయుచుండఁ దానేల చేయరాదని తలంచి తాను నొకఘంటను గట్టించి కర్ణునట్లె జరపుచుండెను.

తనపుత్త్రుఁడగు నర్జునునకుఁ బ్రతిద్వంద్వియగు కర్ణునియొక్కయు శత్రువగు దుర్యోధనునియొక్కయు నౌదార్యమునకు మత్సరించియో, లేక కర్ణునిదాతృత్వగుణమును లోకమున శాశ్వతముగ వెలయునట్లు వెల్లడింపనెంచియో దేవేంద్రుఁడొక బ్రాహ్మణునివేషమును వేసికొని వచ్చి తానొకయజ్ఞమును జేసెదననియు దానికి వలసినంత వంటచెఱకులు దయచేయవలయుననియు యజ్ఞ మారంభించుసమయమునఁ దానువచ్చి యాకలపను బట్టించుకొని పోయెద ననియుఁ గర్ణదుర్యోధనులతో వేర్వేఱ విన్నవించెను. వారును నీకాపత్యము నెఱుఁగమిం జేసి యథాపూర్వముగ నట్లే యొసంగెదమని వాగ్దానము చేసిరి. పిమ్మట నింద్రుఁడింటికిఁబోయి తనవాహనములగు పుష్కలావర్తక మేఘములను బిలిపించి యెడతెఱపిలేని జడిముసురులు పెట్టునటులఁ జేసెను.

అట్టిముసురులలోఁ బొయిక్రిందికి లేక జనులుపలువిధములగు బాధలుపడుచుండిరి. ఎల్లయెడలనున్న యెండుకట్టెలేయుకొ

నిప్పోవుటచే వంటచెఱకులేక జనులు తైలసిక్తము లగువస్త్రములను బ్రజ్వలింపఁ జేసి వంటలను జేసికొనుచుండిరి.

అట్టియదనునం దింద్రుఁ డెప్పటి బ్రాహ్మణవేషముతో బయలుదేఱి మొట్టమొదట దుర్యోధనునకుఁ బ్రత్యక్షమయి యాతఁడు చేసిన వాగ్దానమును నెఱవేర్పవలయునని యాతని వేఁడెను. దుర్యోధనుఁ డప్పుడు తనప్రతిజ్ఞను నెఱవేర్పఁజాలక యిది యదనుగాదని కసరి యాబ్రాహ్మణుని బంపివేసెను. పిదప నాకపటబ్రాహ్మణుఁడు తనయజ్ఞభంగమునకు వగచుచున్న వాని వలె నటించుచు వచ్చుటెనుండి కర్ణునియొద్దకుఁ బోయి *యాతనితోఁ దనవృత్తాంతమును జెప్పి యాతని వాగ్దానమున్నెన నెఱవేర్పవలెనని యాతనిఁ బ్రార్థించెను. రారాజునకే సాధ్యము గానికార్య మాతనికిప్పుడు సామంతరాజున కెట్లు సాధ్యమగును? కాఁబట్టి కర్ణున కేకకాలమున దానవ్రతమునకును, సత్యవ్రతమునకును భంగము సమకూడెను; కాని నిండుమనముతో జరపుకొనుచున్న యావ్రతద్వయమును నీయల్పవిషయమున వీడఁ జాలక మిక్కిలి పరితపించి యెట్టకేల కొకవిధమునమనసునిశ్చయించుకొని ధనుర్బాణములను సంధించెను. సంధించి తనదివ్య భవనముల కాధారములగు దూలములకును వాసములకును బ్రతిగా బాణములను నెలకొల్పి యాకలపను దీయించి బండ్ల కెక్కించి యవి తడియకుండ పైనప్పు జడ్డిని గప్పించి యాబ్రాహ్మణున కప్పగించెను.



అర్జునుఁడు ఖాండవవనదహనకాలమునందు రచించిన శరపంజరమును ధిక్కరించునటుల నాతఁడనేకము లగునంతస్తులు గల మేడలకును మాడుగులకును బాణముల నాధారముగాఁ జేసిన నాతనినేర్పును సామర్థ్యమును గని యింద్రుఁ డాశ్చర్యభీతివిషాదములు ముప్పిరిగొన లజ్జావనతవదనుఁడై యాబండ్లను దోలించుకొని పోవసాగెను.

ఆబండ్లసందడిని మేడమీఁద విహరించు దుర్యోధనుఁడు చూచి యావృత్తాంతమును దెలిసికొని కర్ణునినైపుణ్యసాహసౌదార్యములకుమెచ్చి దానఘంట కట్టుటకుఁ గర్ణుఁడే యర్హుఁడని చెప్పుచు నాతనికి బహుమానముగఁ దనదానఘంటను దీయించి వేసెను. (ఈగాథ భారతమునం దగపడదు.)

కర్ణుని దిగ్విజయమును నాతని యభేద్యకవచప్రభావమును రారాజగు దుర్యోధనుని రాజ్యవైభవంబును నాతనిప్రజారంజకతను ధర్మరాజు చారులవలన విని మిక్కిలి పరితపించుచు నిద్రాహారములపై నభిరుచి లేక సదా వందురుచుండెను.

పాండవపక్షపాతియగునింద్రుఁడును గర్ణునిశౌర్యౌదార్యసాహసాదులను నాతని దుర్భేద్యకవచమును నమృతమయకుండలములను దలఁచి యాతనివలనఁ దనపుత్రుఁడగు నర్జునున కెట్టి

*ఉ. ఆతనియస్త్రవిద్యయు సమంచితకుండలవజ్రవర్మ వి
ఖ్యాతియు నాత్మలోఁ దలఁచి కౌరవనాయక ధర్మసూనుఁడుర్
భీతమనస్కుఁడై యతఁ డభేద్యబలుండని సంతసంబు దై
ర్యాతిశయంబుడించి హృదయవ్యథఁ బొందుచునుండెఁ గానలోఁ.
(భార అర 7 ఆ 3-ప57)

యుపాయము వాటిల్లునో యనుభీతిని బొగులుచుండెను. కావునసే యుచితానుచితములను గాని తనదేవత్వమును గాని పాటింపక మోసమునఁ గర్ణునికవచకుండలములను హరింప నెంచి యుపాయాంతరమును గానక కపటబ్రాహ్మణవేషమును ధరించి మహాదాతయగునక్కర్ణునిఁగవచకుండలములను భిక్షింప నెంచెను.

అట్టితఱిని దనకుఁ బుత్రుఁడును భక్తుఁడును నగు కర్ణునకు నింద్రునిమోసమువలని యుపాయము కలుగకుండఁ జేయఁ గోరి కర్మసాక్షియగు సూర్యభగవానుఁడు నొకబ్రాహ్మణవేషముతోఁ గర్ణునియొద్దకు వచ్చి యింద్రుఁడు చేయఁబోవు మోసము నెఱిఁగించెను. అది విని కర్ణుఁ డాతనిఁ జూచి "మహానుభావా! యిట్టిభావివృత్తాంతము నెఱిఁగిన నీ వొకదైవతమవై యుండ నోపుదువు. దయచేసి నీనిజరూపమును జూపి ప్రసాదింపుము" అని వేఁడుకొనెను.

అప్పు డాతఁడు తననిజస్థితిని వెల్లడించి, "నీవు నాకు భక్తుఁడవగుటయే కాక యొకానొక దేవరహస్యమున. వాత్సల్యపాత్రమవును నగుటంజేసి నీకీహితమునుపదేశింపవచ్చితిని" అని చెప్పెను. కర్ణుఁ డదివిని సంభ్రమాశ్చర్యానందవినయములతో లేచి సాష్టాంగదండప్రణామ మాచరించి యాతనిఁ బూజించి యిట్లు విన్నవించెను.

"ఓమహానుభావా! బ్రాహ్మణులువచ్చినన్నుఁ బ్రాణములు కోరినను నిచ్చుట నాకు దుర్లంఘ్య మగువ్రతమయి యున్నది.



అట్లు నన్ను దేవేంద్రుఁడే వచ్చి యాచించిన నతనికి మనోరథపూరణము చేయకుండఁ జాలుదునా? అట్టివిషయమున వినియోగించుట కీకవచకుండలముల కొక లెక్కయగునా? మఱియు లోకప్రసిద్ధమును నాజన్మవ్రతమును నగునీదానవ్రతమును విడువఁజాలుదునా? నాకు వెఱచి పుత్త్రభిక్షయనఁదగు నిట్టిభిక్షనింద్రుఁడేకోరినప్పుడాతనిని విఫలమనోరథుని జేసి పంపఁజాలుదునా? ఈదానమువల్లఁ దుచ్ఛమగు నాయీశరీరము నశించిన నశించుఁగాక. ఆచంద్రతారముగ నాచంద్రతారలంబోలి ప్రకాశించు నాకీర్తిశరీర మెల్ల జగములనువెలుగొందినంజాలదా? నాయందుఁ గరుణించి హితముపదేశించిన నీయుపదేశమున కడ్డము చెప్పినందులకు నన్ను క్షమింపుము" అని విన్నవించెను.

---

*ఉ. భూసురకోటి వేఁడుటయుఁ బోఁడిగఁ బ్రాణములైన నీగి నా
బాస దినేశలోకమునఁ బ్రస్ఫుట మింతయు నట్లు గావున
న్వాసవుఁడట్టె నన్నడుగవచ్చుఁ బ్రియంపడి నాకు నొక్క బ్రా
తే సురలోకవందిత! మదింగవచంబును గుండలంబులున్.

మ. మతిఁ గుంతీసుతపక్షపాతియగుచు న్మాయాస్వరూపంబుతో
జితధైర్యుండు శతక్రతుండు నను భిక్షింపఁగ నేతెంచువ
ట్టితెఱంగైనఁ దదీయకీర్తియ చుమీ డిందుం ద్రిలోకీసమ
స్నుతమై యొప్పుమదీయకీర్తి యిది సూ నాపుణ్య మెబ్భంగులన్.

ఆ. వె. కీర్తి విడువఁ జాలఁ గీర్తితో మెలఁగంగఁ
జావు వచ్చెనేనిఁ జత్తుఁ గాని
జగములోన నెల్ల నడికంతెఁ జావు మే
లనఁగఁ బరఁగుమాట యనఘ! వినవె?

అట్లు పలికిన కర్ణుని యుచితవాక్యములకు మెచ్చియు సూర్యుఁడాతని హితంబుఁ గోరి మరల నిట్లుపదేశించెను. "నీవు శరీరమును నిలిపికొని సత్కార్యములను జేయుము. 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' నిగదా పెద్దలు చెప్పుదురు. చనిపోయిన వెనుకఁ గీర్తి మృతకళేబరమునకుఁ బెట్టినయలంకారమువంటిదే యగును. జీవించియుండిన నింకను విస్తృతమగు కీర్తిని సంపాదింపఁ గలవు. అమృతమయములగు నీకవచకుండలములున్నంతవఱకు నీవెవ్వరికిని వధ్యుండవు కావు. వానిని విడిచిన నీకుఁ దప్పక మృత్యువు వాటిల్లును. విశేషించి దివ్యాస్త్రవేదియగు నర్జునుఁడు మత్సరించి నీతో యుద్ధము చేయ నున్నాఁడు. కావున వీనిని నీవు విడుచుట కర్తవ్యముగాదు"* అని యిట్లు పుత్త్రవాత్సల్యమునఁ జెప్పిన యాసూర్యునిహితోపదేశమును గర్ణునకు రుచింప దయ్యె. కావుననే "మహాత్మా! నీవతిదయతో నాకుపదేశించినయీవిషయమును శిరసావహింపని యీనాప్రాతికూల్యమును క్షమింపుము. నేను సత్యమును దానశీలతను విడుచుటకు వెఱచినట్లు మృత్యువునకు వెఱవను. ఎట్లైనఁ గానిమ్ము.

సీ. విప్రులు గడు నర్థి వేఁడినఁ గలిమి లేఁ, బొంకంబు సేయక యిచ్చుటొకటి
బలితంపుఁబగతురఁబరిమార్చుటొక్కటి, దండిగైయెదునిఁజచ్చుటొండొకటి
శరణాగతుని నెట్టిశత్రుని నైనను, గరుణఁ గయ్యంబునఁ గాచుటొకటి
భామినీద్విజవృద్ధబాలాతురుల కైన, యాపదఁ జెచ్చెరఁ బాపుటొకటి
ఆ. అనఘ యివివ్రతంబులై చెల్లు నాకు నిం, దొకటి దప్పెనేని వికలకీర్తి
నగుదుఁ గాని నిత్తు నఖిలభావముల నా, ఖండలునకుఁ గవచకుండలములు.
(భా. ఆర. 7 ఆ. 287-291-292-294 ప.)



మఱియుఁ గవచకుండలముల వీడినను నన్నర్జునుఁడు వధింపఁ గల్గుట కల్ల. పరశురాముని ప్రసాదమున నాకు లభించిన దివ్యాస్త్రము లల్పములు గావు. వానిచే నా కర్జునుఁడు సుజయుఁడు కాఁగలఁడు" అని విన్నవించెను.

అప్పుడు సూర్యుఁ డాతనిని మళ్ళింపఁజాలక "పోనిమ్ము ఇంద్రుఁడు నిన్నుఁ గవచకుండలములు యాచించునప్పు డాతని యొద్దనున్నశక్తియను దివ్యాయుధమును గోరుము. ఇంద్రుఁ డాదివ్యశక్తితో ననేక రాక్షసులను వధించెను. అది యున్నచో నీకు యుద్ధములందు జయము కలుగఁగలదు" అని యుపదేశించి యంతర్ధాన మయ్యెను. పిదప దానవీరుఁ డగు కర్ణుఁడును నింద్రునిరాకకు వేచియుండెను.

ఒకానొకనాఁడు కర్ణుఁడు సూర్యోపాస్త్యనంతరమున మధ్యాహ్నసమయమున బ్రాహ్మణులకుఁ గోరినకోరికలనిచ్చుచున్న సమయమునఁ బాండవపక్షపాతి యగు నింద్రుఁడును నొకబ్రాహ్మణునివేషముతో వచ్చి "భిక్షాం దేహి" అని పలికెను. కర్ణుఁ డావిప్రుని జూచి "అయ్యా! నీ కేమి కావలయునో కోరుకొమ్ము. ధనకనకవస్తువాహనాదు లేవికావలసినను నిచ్చెదను" అని పలికెను "ఓమహాత్మా! నీవు చెప్పిన వేవియు నాకు వాంఛితములు

*క. అనృతమున కెంత వెఱతును
వినుమంతకునకును నంత వెఱవ మును గ్రహిం
చినవ్రతము విడిచి దుర్గతిఁ
జనఁ జాలుదు నయ్యా నన్ను జనునే మాన్పన్?
[భా. ఆర. 7 ఆ. 303 ప]

కావు. నీకవచకుండలములు నాకుఁ బ్రసాదింపవలయును" అని యావిప్రుఁడు వచింపఁగా "ఓహో! ఇట్టు లెవ్వరైన నెన్నఁడైనఁ గోరిరా? బ్రాహ్మణులకు వీనివలన నేమిప్రయోజనము? కాఁబట్టి యీవెఱ్ఱికోరికను విడిచి యింకేమైనఁ గోరికొమ్ము. నాకుఁగల సర్వస్వమును గోరినను నిచ్చెదను" అని బోధపఱచెను.

అట్లెన్నివిధములబోధపఱచినను నాతఁడుమరలకుండెను. అది చూచి యాతఁడు దేవేంద్రుఁడె యని కర్ణుఁడు గ్రహించెను. "నేను గ్రహించితిని. నీవు దేవేంద్రుఁడవు. మూఁడులోకములను బరిపాలించు నీవే యీరీతిని నన్ను మోసపుచ్చుట యుచితమా? ఇట్లు మోసపుచ్చి నన్ను శత్రులకెరఁజేయుట న్యాయ్యమా?" అని విన్నవించెను. "ఔనౌను. నీకు సూర్యుఁడుపదేశించిన విషయము నేనెఱుఁగుదును. అట్లయినను నీవు నిత్యసత్యవ్రతుఁడవు, మహాదాతవు, ప్రతిజ్ఞాపాలనతత్పరుఁడవు నగుటచే నన్ను విఫలమనోరథుని జేయవను నమ్మకతో వచ్చితిని. మాబోఁటుల కిష్టమయిన యీకార్యమునకు నీవు సందేహింప నేల?" అని యింద్రుఁడు పలుకఁగా "మహాత్మా! నీ కెట్లైన వీనిని గ్రహింపవలయుననియే యభిప్రాయ మున్నయెడల నిచ్చివేసెదను. పుచ్చికొమ్ము; కాని సకలశత్రుఘాతిని యగు శక్తి యను నీయమోఘసాధనమును నాకుఁ బ్రసాదింపుము" అని కర్ణుఁడు బదులు చెప్పెను. అపు డందుల కింద్రుఁడొడంబడి యొక్కమాఱుమాత్రము ప్రయోగించుటకు నిర్ణయించి యద్దానిని బ్రసాదించెను. అప్పుడు కర్ణుఁడు "మహాత్మా! నాకీలోకమున



వధింపఁదగినశత్రు వొక్కఁడె గలఁడు. కావున నొక్కమాఱు మాత్రమె యుపయోగించినం జాలును" అని పలుకుచుఁ దాని బరిగ్రహించెను. అపు డింద్రుఁడు చిఱునవ్వు నవ్వుచు "నీయభిప్రాయ మే నెఱుఁగుదును. నీచే నర్జునుఁడు వధ్యుఁడు కానేరఁడు. అతని రక్షించుటకు శ్రీకృష్ణుఁడు గంకణముఁగట్టుకొనియున్నాఁడు" అని బదులు చెప్పెను.

ఆహా! కర్ణుఁడు తనకీర్తిశరీరమును గాపాడుకొనుటకై శరీరమును గోసి యిచ్చుటకుఁ గాని తనమరణమునకుఁ గాని వెనుదీయకున్నను దానర్జునుని వధించు నని నమ్మియున్న దుర్యోధనుకార్యమునకుఁ గావలయు నిట్లు తనప్రియమగు కీర్తిశరీరమునకుఁ గంళకమును దెచ్చుకొనుటకును సాహసించెను. (చూ 9 ప్రక) ఇట్లు ప్రతిఫలము గోరుటచేతనే కదా "చండాంశుసుతు పోల్కి కుండమార్పులు గాక" అని యాతని నిరసించుటకుఁ గవులకు సందు దొరకెను. నిజమయినస్వామిభక్తులు స్వలాభనష్టములను బాటింపక స్వామికార్యమునకై తమశరీరమును ధారవోయుట వింతకాదు గదా!

పిదపఁ గర్ణుఁడు నిర్వికారుఁడై యొకకత్తితోఁ దనసహజములగు కవచకుండలముల నొలిచి సుముఖుఁడై యింద్రునకు సమర్పించెను. ఇంద్రుని యనుగ్రహమున నట్లొలిచినను నెవ్విధమయిన వికృతియు, నాతని శరీరమునకుఁ గలుగకుండెను. ఆసమయమున నాతని సాహసౌదార్యములకు మెచ్చి గంధర్వయక్షు

కిన్నరసిద్ధసాధ్యులు దేవదుందుభులు మ్రోయించి యాతనిపైఁ బుష్పవృష్టిని గురిసిరి.*

పయివృత్తాంతము చారులవలన విని ధర్మరా జూఱడిలి కాలముం బుచ్చుచుండెను. తమజయమునకు మూలకందమగు కర్ణున కిట్టిలోపము సంభవించినందులకుఁ గౌరవులు విషాదమునఁ బొగులుచుండిరి.

ఔరా! కర్ణుని యౌదార్యము నేమని చెప్పవచ్చును? దాతృత్వమునందును సత్యవ్రతపాలనమునందును నాతనికి సమానులు లేరనుటకు సందేహముగలదా! కవచకుండలముల నిచ్చివేసినచోఁ దనకు మృత్యువు సంభవించునని యెఱిఁగి యెఱిఁగి యట్లు శరీరమును గోసియిచ్చుట యెంత యద్భుతము! ఈవిషయమున నింద్రుఁ డనుచితముగఁ గర్ణుని మోసపుచ్చి తనపుత్త్రుఁడగునర్జునున కుపకార మొనరించె ననియందురు గాని, నిజ మారయఁగా నట్లు కాదని చెప్పవచ్చును. ఈ చరిత్రము చేతనే కర్ణుని యౌదార్యము, సాహసము, సత్యవ్రతము, ధైర్యము, మొదలగుమహాగుణములు లోకమున దృఢముగ నెలకొల్పఁబడినవని నాయభిప్రాయము. ఇఁక నిట్టికర్ణునివధించుటకును నర్జునుఁడు పడినపాటులు ముందు మా చదువరులు వినఁగలరు.

---

* చ. అలఘునిశాతశస్త్రమున నంగము లన్నియు నిర్వికారుఁడై
యొలువఁ గొడంగి కిచ్చి యొక హోయని కిన్నరయక్షసిద్ధసా
ధ్యులు దివినుండి యార్చుచును దూర్యరవంబు సెలంగ నద్భుతం
బెలయఁగఁ బుష్పవృష్టిఁ గురియించిరి కర్ణుపయిం బ్రియంబునన్."

[భా. అర. 7. ఆ. 374 ప]

# ఎనిమిదవప్రకరణము.

—: ♦ కర్ణునకుఁ దటస్థించిన చిక్కులు ♦ :—

కర్ణుఁ డిట్లు శరీరమును గోసి దానము చేయుటచేఁ జర్మమునఁ బటుత్వము తగ్గెను. కావుననె యుద్ధములందు శత్రులబాణములను గాయపడినప్పు డోర్చి నిలిచియుండుసామర్థ్యము తగ్గిపోయెను.

పాండవులు తాము నడపవలసినయజ్ఞాతవాసమును మాఱువేషములతో విరటునికొల్వున జరపుచున్నారని చారులవలనఁ దెలిసికొని వారిని బయలుపెట్టుటకై దుర్యోధనుఁడు తనసేనలతో విరటునిపైకి దండెత్తి యాతనిపురికి దక్షిణోత్తరభాగముల నున్న యాతనిగోధనముల నాక్రమించెను. మొదట దుర్యోధనమిత్రుఁడగు సుశర్మచే నాక్రమింపఁబడిన దక్షిణభాగమునకు సర్వసేనలతోను విరాటుఁడు వెడలెను. పిదప దుర్యోధనుఁడు భీష్మద్రోణకర్ణాదియోధులతో వచ్చి యుత్తరపుదెస నాక్రమించెను. ఆ సమయమునకు యువరాజగు నుత్తరుఁడు శాపవశమునఁ బేడిరూపముతో నున్న బృహన్నలయును నర్జునుఁడును దప్ప మఱి యోధు లెవ్వరును బట్టణమున లేకుండిరి. అపు డుత్తరుఁ డాబృహన్నలను సారథిగాఁ జేసికొని శత్రుల నెదిరించుటకుఁ బోయెను. గాని యాతఁడు కురువీరుల సైన్యమును జూచి బెగ్గిలి మరలి పాఱివ

చ్చుట కేయుంకించెను. అప్పటికి సావనమానముచే నజ్ఞాతవాస వత్సరముకూడఁ బూర్ణమై గతించుటచే నర్జునుఁడు నిశ్శంకముగా నుత్తరునకుఁ దనవృత్తాంతమును జెప్పి యాతని సారథిగాఁ జేసికొని కురువీరుల నెదిరించెను. దీనినే యుత్తరగోగ్రహణ యుద్ధమందురు. ఈమహాయుద్ధమున, నర్జునుఁ డొక్కరుఁడె భీష్మద్రోణకర్ణాశ్వత్థామాదియోధులతోఁ దుర్యోధనునోడించి పశువుల మరలించెను.

ఈయుద్ధమున దుర్యోధనుఁడు గెలిచినచో ముందు సంధి కుదుర నేరదు గాననిందుఁ గౌరవులకు సంపూర్ణపరాజయము కలుగుటయే కళ్యాణోదర్కమని భీష్మాదులు తలఁచిన ట్లూహింప వలసియున్నది. భీష్ముఁడు పరిశుద్ధమగుచరిత్రగలవాఁడే యయ్యు వంశనాశనమునకు వెఱచియు రాజనీతిని దలఁచియు నీసంధివిషయమునఁ గొంచెము కాపట్యము నవలభించెనని యంగీకరింపక తప్పదు. ఈవిషయ మంపశయ్యపైఁ బడియున్న భీష్ముని యొద్దకుఁ గర్ణుఁడు వెళ్ళినప్పుడు వారికి జరిగిన ప్రసంగముచే సూచితమగుచున్నది. అర్జునునిసమ్మోహనాస్త్రము నుపసంహరింపఁ జాలియు భీష్ముఁడూరక పడియుండుట సావనమానమునఁ బదుమూఁడేఁడులు నిండెనని యెఱింగియుఁ బాండవులను బయలు పెట్టుటకు బయలుదేఱెడు దుర్యోధనునకుఁ దెలుపకుండుట, తుదకర్జునుఁడు వచ్చుచున్నప్పుడు పదుమూఁడేఁడులును నిండెనని సాక్ష్యము నిచ్చుట, యతిరథశ్రేష్ఠుఁడగు కర్ణునర్ధరథుఁడని చెప్పుట మొదలగునవియును ఈ యభిప్రాయమును బలపఱు



పఁ జాలియున్నవి. పాండవులను బయలు పెట్టుటయే ప్రయోజనమని బయలు వెడలివచ్చినదుర్యోధనునకు హఠాత్తుగా భీష్ముఁడు వారి సమయము పూర్తి యయ్యెనని చెప్పుటచేతను, భీష్మాది యోధులు సరిగఁ దోడ్పడకుండుటచేతను చోద్యమువడియున్నట్టియు నప్పు డర్జునునితో యుద్ధము సంభవించు నని తలఁచి యుండనట్టియు విరాటు నోడించుటకు మాత్రము తగిన సన్నాహముతో వచ్చినట్టియు దుర్యోధనునితోఁ గూడఁ గర్ణుఁడు పరాజితుఁ డగుట వింతకాదు. ఇంతియకాక పదుమూఁడేఁడులు పడరాని కష్టములుపడి మిక్కిలి కినిసియున్న యర్జునుని వాఁడి నారసముల నోడలు కోసికొని యున్నట్టియు నెట్లయిన జీవించి యుండి యర్జునుని వధించి తనప్రతిజ్ఞను నెఱవేర్పఁ గోరి యున్నట్టియుఁ గర్ణుఁ డొక్కరుఁడు నిలువరింపఁ జాలకుండుట యద్భుత మెట్లగును?

పిదప భీష్మాదులు సావనమానమునఁ బదుమూఁడేఁడులును బూర్తియయినవనియు నిఁక నిప్పుడు మనము చేయునది లేదనియు నిప్పుడు మరల యుద్ధము చేయుటకుఁ బ్రసక్తిలేదనియు దుర్యోధనునకు బోధచేసి మళ్ళించి తీసికొని పోయినందున మరల యుద్ధము పొసఁగదయ్యె.

పాండవు లట్లు బయలుపడి విరాటపుత్రిక యగు నుత్తర నర్జునపుత్రుఁడగు నభిమన్యునకుఁ బెండ్లిచేసికొని విరాటునితోఁ గూడ బాంధవము నొందిరి. పాంచాలమత్స్యదేశాధీశులును, యాదవులును, బాండవులకుఁ బరమాప్తులగుటం జేసి వారు కౌర

వులపై దండెత్తుటకుఁ దగినసామగ్రిగలవారైరి. కావునఁ బాండవులది మొదలుగ యుద్ధప్రయత్నములు చేయుచుఁ దమబంధుమిత్రుల సాహాయ్యమునుఁ గోరి దూతల నంపుచు లోకనిందను మాపి కొనుటకుఁ గౌరవులతో సంధికై రాయబారములు నడుప సాగిరి. ఈవిషయమును జారులవలన విని దుర్యోధనుఁడును దగిన ప్రయత్నములతో నుండెను.

ధర్మరాజుచే నాహూతుఁడై నకులసహదేవులమామ యగుశల్యుఁడు ధర్మరాజుసేనాసన్నివేశము కడ కొకయక్షౌహిణీసైన్యముతో వచ్చుచుండెను. దుర్యోధనుఁ డారాకను చారులవలనఁ దెలిసికొని యాతఁడు వచ్చుత్రోవలఁ జదును చేయించియు సత్రశాలలను జలపందిరులను బజారులను నిలిపి వస్తుసమృద్ధిని గూర్చియు నుపచారము లొనరించుచుఁ దాను ప్రచ్ఛన్నుఁడై యందంద తిరుగుచుండెను. అప్పుడు శల్యుఁడట్టి యనుకూలప్రవృత్తికి సంతసించి. "ఈరీతిని మనకు సదుపాయముల నొనరించుచున్నవారి రావింపుఁడు. వారు నాచే బహూకరింపఁదగియున్నారు" అనిపల్కెను. అదియెసమయమనిదుర్యోధనుఁ డాతనిసరికేఁగి తన్నెఱింగించికొనెను. శల్యుఁ డత్యాదరమున నాతనిఁ గౌఁగిలించుకొని "నీకుఁ బ్రియముచేయఁదలంపు గల్గియున్నది. కావుననీకుఁ గలవాంఛితము నెఱింగింపు" మని నచియించెను. అందులకు దుర్యోధనుఁడు మిక్కిలిసంతోషించి "నీవు నాకుమంత్రివై యుండి యిప్పుడునాకుఁ దటస్థించిన యీ యుద్ధమున నాసేనల నడిపి సాహాయ్యమును జేయవలయును.'



అని ప్రార్థించెను. శల్యుఁడు దుర్యోధనునికోర్కె నెఱవేర్చుట కంగీకరించి సత్యప్రతిజ్ఞుఁ డయ్యెను.

అయినను పాండవులు తనకుఁ బరమాప్తులగుటం జేసి వారినొకమాఱు చూచివచ్చెదనని దుర్యోధనునితోఁ జెప్పి ధర్మరాజున్నచోటికిఁ బోయెను. పోయి యాతనిచే సత్కరింపఁబడి తనవృత్తాంతమును సాంతముగాఁ దెలియఁబఱచెను. లౌకికుఁడగు ధర్మరాజును నందులకుఁ జింతింపక తనపక్షమువారువిరోధులసేనలోఁ జేరియుండుటయుఁ దనకుపకారకమె యగునని తలఁచియే కావలయు నాతని నిష్ఠురములాడక యాతనియుదాత్తతకు సంతసమునుజూపుచుస్తుతించెను. అపుడు శల్యుఁడు మిక్కిలి ప్రసన్నుఁడయి యాతనియరణ్యావాసాదిక్లేశములకువగచియునాతని సత్యవ్రతమునకుమెచ్చియు సబహుమానముగఁ బ్రసంగించెను. అదియె సందుచేసికొని ధర్మరాజు శల్యునితో నిట్లు విన్నవించెను. "ఒకనిమెచ్చియాతనికోర్కెతీర్చుటమీవంటిమహాపురుషులకు సహజమే. కావున దుర్యోధనుని గృతార్థుని జేసినందులకెంతయు సంతోషించుచున్నాను. అట్లె నాకును నొక్కవిషయమున సాహాయ్యము చేయవేఁడుచున్నాను. శ్రీకృష్ణుఁ డర్జునునకు సారథి కాఁగలఁడు. అట్టియర్జునునితో ద్వంద్వయుద్ధము చేయ నున్నకర్ణుసారథ్యమునకుదుర్యోధనపక్షమునఁగృష్ణునివలె నశ్వహృదయము నెఱిఁగినవారు మీకన్న నెవ్వరును లేరు. కాన నవశ్యమును దుర్యోధనుఁడు మిమ్మును గర్ణసారథ్యమును జేయఁ బ్రార్థింపఁగలఁడు. అందులకుఁ దా మంగీకరించి కర్ణార్జునుల ద్వంద్వయుద్ధకాలమునఁ గర్ణుని నిరసించియు నర్జునుం బొగడి

యుఁ గర్ణునిమనసు వికల మగునట్లు ప్రసంగించి వానియుత్సాహము నడంచి యర్జునున కపాయము రాకుండఁ గాపాడవలయును. అనుచితంబని తలంపక నాయందు దయఁజూపి యిందులకంగీకరింపవలయును" అని ప్రార్థించెను. శల్యుఁడును దుర్యోధనుని పక్షమునకుఁ దాఁబోయిన యపచారమును మాపికొనుటకుఁగావలయు ననుచితమైనను ధర్మరాజుప్రార్థనమున కంగీకరించి యాతనియనుమతిని దుర్యోధనుపాలికిఁ బోయెను.*

కురుపాండవుల సంధివిషయమున శ్రీకృష్ణుఁడు కౌరవసభ కేఁగి సంధి జరుగ దనువిషయము స్పష్టముగఁ దెలిసికొని ధర్మజునొద్దకుఁ బోవుచుఁ దనమేనత్తయగు కుంతికి మొదటి పుత్రుఁ డగుకర్ణుని బాండవపక్షమునకు రాఁదీయఁ దలంచి యాతని బిలిచి యాతఁడు కుంతీపుత్రుఁ డగుటయు రహస్యముగాఁ దెలిపి పాండవులపక్షమునకు రావలెననియు నట్లువచ్చినయెడల

* "సమరసమయంబున నిరాకరించి పలికి కర్ణు చిత్తంబునకుఁ గలఁక పుట్టించి పార్థు రక్షింపవలయు నకృత్యంబని యనుమానింపక మత్ప్రార్థనంబున నెల్లభంగుల నివ్విధం బనుష్ఠింపవలయు"నని యభ్యర్థించిన (ధర్మరాజు) సమ్మతించి శల్యుం డిట్లనియె.

క. కర్ణుని సారథి నైనను, నిర్ణయమున కేను బార్థునిం గాచెద నా
దుర్ణయవిచారు నెమ్మెయిఁ, గర్ణకఠోరంబు లాడి కలఁతుం బోరన్.

తే. దర్పమును దేజమును మాయ దలరఁ బలికి
చిక్కువఱచిన నేయంగఁ జేతులాడ
కునికి రాధాతనూజు నర్జునుఁడు త్రెవ్వి
బహుళబాణపరంపరఁ బాలుపఱుచు.

(భా. ఉ. 1అ. 112-113, ప.)



కృష్ణుఁ డగునాతనికే రాజ్యాభిషేకము తనప్రేరణమున జరుగఁ గలదనియు, ద్రౌపదికూడ నాతనినియథాంశముగఁ బరిగ్రహింపఁ గల దనియు బోధపఱిచెను. *కాని ధర్మాత్ముఁడును, వైషయికభోగవిరాగియు నగుకర్ణుఁ డందులకు సమ్మతింపక యిట్లు ప్రసంగించెను.

"ఓయీ శ్రీకృష్ణుఁడా! నేనివృత్తాంతము నింతకుముందె కొంచెకొంచెము వినియున్నాను. మూత్రపురీషములనెత్తి కన్నకొడుకునువలె నన్నుఁ బెంచుకొని యున్న నాతలిదండ్రు లగు

*సీ. నీవు వృద్ధజనోపసేవివి ధర్మసం
వేదివి తెలియఁగ వినుము సిద్ధ
మంత్రబలంబున మార్తాండువరమునఁ
గన్నియతఱిఁ గొంతి కన్నవాఁడ
వగుటఁ బాండునృపాలునగ్రసుతుండవు
ధర్మమార్గం బది ధర్మతనయుఁ
డాదిగాఁగలతమ్ము లందఱు నాచేత
నెఱిఁగి నీ యడుగుల కెఱఁగి సకల

గీ. పుత్త్రమిత్త్రబంధుభూరిసేనాసమ
న్వితముగాఁగఁ గొలిచి నిన్ను రాజ్య
భారవహనమునకుఁ బట్టంబుగట్టను
జ్జ్వలుండ వగుదు గమ్ము వారికడకు.

క. పాంచాలరాజపుత్త్రియు
నంచితముగ నిన్నుఁ బొందు నార్వురవరుసన్
సంచితపుణ్యుఁడ వీవొక
యించుకయును వేఱుసేయ కేతెమ్మలమిన్.

(భా. ఉ. 4 అ. 29-31 ప.)

రాధాధిరథులను విఫలమనోరథులఁ జేసి, వారిని విడిచిపెట్టి నేనిపుడు కుంతికొడుక నని వచ్చి యెట్లు నల్వురలోఁ దిరుగువాఁడను. అట్టి నాతలిదండ్రులను విడుచుట నాకుఁ బాతకము కాదా? మఱియు నే నధమకులుఁడ నని నిరసింపఁబడుచున్న సమయమున నాదరించి నేఁటికిని నుత్తరోత్తరాభివృద్ధిగ గౌరవించుచుఁ దనసోదరులకంటె నన్నెక్కుడుగాఁ జూచుకొనుచు నున్నట్టియు నేనర్జునుని జయించెదనను నమ్మికతో నామూలము ననే యుద్ధమునకు సిద్ధపడుచున్నట్టియు దుర్యోధనుని విడిచి యాతని శత్రుపక్షమున నేనెట్లు చేరఁగలను? అంతకంటె ఘోరమగు పాతకము వేఱొకటి యుండునా? ఇంతియ కాక యిట్టియుద్ధసమయములం దితరులగు రాజులును సాయపడుచుండఁ జిరకాలమునుండి యాతనివలన నెన్నెన్నో మన్ననలను గాంచి తుదకు స్వామిఋణముఁ దీర్చుకొనఁ దగిన సమయము తటస్థించినపు డిట్టిపనిసేయుట యెంతనీచున కయినఁ దగియుండునా? ఇట్టి యకృత్యమును జేయు మని నా కుపదేశించుట సర్వధర్మమర్మజ్ఞుఁడ వగు నీకుచితమా? పాండవులు నాకుఁ దమ్ములె కానిమ్ము. ఇంకెట్టివారు కానిమ్ము. నాకు భూలోకరాజ్యమునకుఁ బట్టాభిషేకము చేయుము. లేక త్రైలోక్యరాజ్యమునకుఁ బట్టాభిషేక మొనరింపుము. నేనందులకు సమ్మతింపఁ జాలను. దుర్యోధనుని సేవకత్వమును విడువఁజాలను. మఱియు నేనర్జునుని జయించెదనని దుర్యోధనునకుఁ బ్రీతిగఁ బ్రతిజ్ఞ చేసియున్నాను. అట్టిప్రతిజ్ఞను నెఱవేర్పఁజాలిన నెఱవేర్చెదను. లేకున్న నాప్రాణములను దుర్యోధనుని కార్యముఁగ్రింద వినియోగించి



స్వామిఋణముం దీర్చికొని శుద్ధుఁడ నయి కృతార్థుఁడ నయ్యెదను. నీ వెన్ని చెప్పినను నిదియె నానిశ్చయము. నాయందుఁ గరుణించి యుపదేశించిన నీయుపదేశమును మన్నింపనందులకై క్షమింపుము. దయచేసి యనేకములగు ననిష్టములకు మూలకంద మగు నీనాజన్మరహస్యమును బయలుపెట్టకుము" అని యిట్లు ప్రసంగింపఁగా శ్రీకృష్ణుఁడును మరలి పోయెను.

ఇట్లే యొకనాఁడు కుంతి కురుపాండవయుద్ధమాసన్నమయి యుండఁ గౌరవపక్షవీరు లగుభీష్మద్రోణకర్ణులనుస్మరించి భీతిల్లి యందుఁ బాండవపక్షపాతులగుట భీష్మద్రోణులనుగణింపక దుర్జయుఁడును దుర్యోధనకార్యనిర్వహణైకమానసుఁడును నగుకర్ణుని దలఁచి విచారింపసాగెను. తుదకుఁ గర్ణుపాలికిఁబోయి యాతనిజన్మవృత్తాంతమును జెప్పి పాండవులయందు సహోదరప్రేమ మాతనికిఁ గలుగునట్లు చేయుటయే కర్తవ్య మని నిశ్చయించుకొని యామె యాతనిపాలికిఁ బోయి పుత్త్రభిక్షను వేఁడి యాతఁడు మొట్టమొదటఁ దనకు సూర్యునివలనఁ గల్గినవిషయమును జెప్పి "పాండవపక్షములోనికిఁ జేరి రాజ్యాభిషేకమునొందుము" అని బోధపఱిచెను. ఆ సమయమున "కుంతీవాక్యము సత్యమయినది. అట్లేచేసి శ్రేయస్సునందుము" అని కర్ణునకువినఁబడునట్లుగ నొకవాక్యము సూర్యమండలమునుండి బయలు వెడలెను. అట్లయినను గర్ణుఁడుచలింపక దుర్యోధనునియందలి భక్తిని విడువక వెనుకఁ దాను శ్రీకృష్ణునకుఁ జెప్పినయుత్తరములనె కుంతికిని జెప్పి యామెప్రార్థనమును మన్నింపకుండెను; కాని ధర్మ

రాజాది పుత్త్రులకుఁ దనవలన హాని సంభవించు నని భీతిల్లి యజ్ఞావదశలోఁ దాను జేసిన యతిగోపనీయ మగు రహస్యకృత్యమును సయితము వెల్లడించి పరిపరివిధములఁ బ్రార్థించు తల్లి యగు కుంతీమహాదేవిని విఫలమనోరథురాలిని జేయఁ జాలక తనప్రతినకు భంగము లేకుండ నర్జునుని దక్కఁ దక్కిన యామె పుత్త్రుల నలువురను జంపక విడిచి పుచ్చెద నని వరమును బ్రసాదించి యర్జునుం గలిపి కాని తన్నుఁ గలిపి కాని యామె కైదుగురు పుత్త్రులు నిలుతురని విన్నవించెను. అట్టి స్థిరప్రతిజ్ఞుఁ డగు కర్ణుని పలుకులు విని విచారముతోఁ గుంతి యుధిష్ఠిరాదులను నల్వుర నైన [వధింప]కుండు మని చేసిన వాగ్దానమును మఱువకుండు మని కర్ణునిఁ బ్రార్థించి యింటికిఁ బోయెను*

---

*మ. తమవారిన్ సిరికై వధించు టిది సద్ధర్మంబె యక్లేశకృ
త్యమె తాఁ గయ్యము ద్రోణభీష్మకృపకర్ణాటోపముల్ మాన్చుట
ల్పములం బెఱు నెఱయంగ నక్కజాని యుల్లం బెప్పుడుం గ్రోధదీ
ప్తము భీమాదులమీఁదఁ దక్కొడుకుల కుత్సాహంబు లేదాజికిన్

ఉ. నీపలు కెంతవోలినను నిర్ణయ మిట్టిద కాని యొండు లే
దీపని మీఁది భాగమున నీవిట వచ్చితి గానఁ బాండవుల్
నేపడిరేనిఁ జంప నఱసేయక చెప్పెద సవ్యసాచిపైఁ
గోపము పెద్ద వాఁడు సమకూరిన బిట్టలఁ జంపుదున్ జుమీ.

చ. అనుటయు నష్ట కొంతి హృదయంబున శోకము నివ్వటిల్ల ని
ట్లను నిది దైవసంఘటన మక్కట యెట్లును దప్ప నేర్చునే
యనుపమసత్యవిస్ఫురణ నాడినమాట మఱానుమన్న నీ
యనుజుల నల్వురం గవ్వు మర్జున నేఁతను సమ్మతించితిన్,



అక్కటా! కర్ణున కీవిషయమున నెట్టి యిక్కట్టు సంభవించెనో యెఱుఁగుఁడు. తా ననామకుఁడై నీచకులజుఁ డని నిరసింపఁబడు సమయమునఁ దన్నాదరించి యుత్తరోత్తరోత్కర్షముగ మన్నించుచున్న దుర్యోధనునిఁ గార్యము పుట్టి వచ్చినప్పుడు విడువవలయును. మఱియు నట్టి దుర్యోధనుఁడు చేసిన మన్ననలకు మెచ్చి తా నర్జునుని వధించెద నని యాతనికిఁ బ్రీతికరముగఁ జేసిన ప్రతిజ్ఞను విడువవలయును. లేదా కడుపారఁ గన్నతల్లియొక్కయు మేనమామ కుమారుఁడును భగవంతుఁడును నగు శ్రీకృష్ణునియొక్కయు సకలదేవతాగ్రగణ్యుఁడును నిష్టదైవతమును దండ్రియు నగు సూర్యభగవానునియొక్కయు హితవాక్యముల నుల్లంఘించి చేతిలోఁబడి యున్న సామ్రాజ్యమును త్రిలోకసుందరి యగు ద్రౌపది సాంగత్యమును విడుచుకొని, తన్ను నెఱుంగని సహోదరుని దానె తెగి వెఱగి చేసేతఁ జంపికొనవలయును. మహాధైర్యశాలియు స్థిరప్రతిజ్ఞుఁడును సత్యసంధుఁడును నగుటచే నిట్టి సమయములందుఁ జలింపక కర్ణుఁడు సామ్రాజ్యముకన్నను దుర్యోధనుని సేవకత్వమునే యున్నతపదవిగ భావించెను. మహాపురుషుల కనుచిత మగు సామ్రాజ్యమునకంటె నుచితమగు సేవకత్వము యధికతరముగ రుచించుట వింతకాదు. మహాధర్మశాలియని ప్రసిద్ధికెక్కిన ధర్మరాజు సైతము ద్రోణవధాదివిషయములందు నసత్యము ననౌచిత్యమును నవలంబించుటకు సాహసించెను గాని కర్ణుఁ డట్లు చేయఁ జాలఁడయ్యె.

తొల్లి భీష్మునివంటి మహానుభావుఁడును గౌరవులవలెనే పాండవులును దనకు నాప్తులగుటం జేసి పాండవపక్షపాతి యై సమర్థుఁడయ్యు స్వామియగు దుర్యోధనునికార్యము నెఱవేర్పకయు నాతనియందుఁ బక్షపాతమును జూపకయుఁ బ్రవర్తించెను. కర్ణుఁడన్ననో పాండవులు తనకు సహోదరులని తెలిసినను వారియం దణుమాత్రమును పక్షపాతము చూపక యెప్పటియట్ల దుర్యోధనపక్షపాతియై ప్రవర్తించెను.

---

## తొమ్మిదవప్రకరణము

### —♦కర్ణనిర్దౌష్ట్యము - నిర్దోషిత♦—

దుర్యోధనుని శ్రేయస్సు గోరునట్టి స్వామిభక్తుఁ డగు కర్ణుఁడు యుధిష్ఠిరాదులను జంపకుందునని కుంతికి వరమిచ్చుట యుచితమా యని శంకింపఁ బనిలేదు. మహౌదార్యశీలుఁడగు కర్ణుఁడు పుత్రభిక్షను వేఁడుచున్న తల్లి నెట్లు విఫలమనోరథురాలిని జేసి యుంపఁగలుగును? మఱియు నర్జునుని జంపుటకే తాను బ్రతిజ్ఞను జేసియుండెను. దుర్యోధనుఁడు కర్ణుని గోరునదియు నయ్యదియె. భీముని జంపుట గదాయుద్ధమున నిరుపమానుఁడగు



దుర్యోధనున కొకగొప్పకార్యముగఁ గనుపట్టలేదు. [illegible]యుఁ డగునర్జునుని గర్ణుఁడువధించినచో దుర్యోధనునికార్యము సిద్ధప్రాయమె యగును. అర్జునుని వధింపఁజాలనప్పుడు భీమాదులను జంపినను దుర్యోధనునికి లాభములేదు. కావున మాతృవాక్యపరిపాలనమునకును స్వామికార్యమునకును భంగము లేకుండ నర్జునుని దా వధించుటగాని తానర్జునుచేఁ జచ్చుటగాని కర్తవ్యమని నిశ్చయించుకొనెనని చెప్పవలసియున్నది. అయినను గర్ణుఁడు కవచకుండలములను గోలుపోవుటచేతను భూసురభార్గవశాపములచేతను నర్జునుని జయింపఁ జాలనని యెఱిఁగి యుండలేదా?

---

* తే. భీమసేనుని నీవింత పెద్దచేసి
పెక్కుభంగులఁ జెప్పితి వుక్కుగలఁడు
గదకు నేర్చునం చెంతయు బెదరదతఁడు
నన్నుఁబోలమి యెఱుఁగవే నరవరేణ్య!

మ. గద నాతో సరి మూఁడులోకముల నేఁ గానం జలం బెత్తియు
న్మదుఁ డాభీముఁడు నన్ననిం దొడరెనే వజ్రప్రహారంబు బె
ట్టిదమై తాఁకినఁ గూలుపర్వతము మాడ్కిం గుంభినిం గూలవ్రే
సెద నాకోర్కి గదా గదారణము వచ్చెం బెద్దకాలంబునన్.

ఆ. అతఁడు వడిన వెండియా సేనఁ గోట్లల
సేయ నొకఁడు లేమి సిద్ధమింత
యెఱిఁగి వెఱచు కాదె యేనూళ్ళు లైనను
దమపఁ జాలుననియె ధర్మసుతుఁడు.

వ. అర్జునుఁడు గలఁడని తలఁచితి వేని.

తే. కర్ణువడసిన యాశక్తి గలుగఁ బోరఁ
బ్రదుకవచ్చు సేనరుసను నదియుఁ గాక.”

[భార. ఉ. 2 ఆ. 21. ప. మొ.]

అట్లెఱిఁగి యెఱిఁగి యర్జునుని వధింతునని ప్రతిజ్ఞ చేసి దుర్యోధ
నుని నమ్మింపనగునా! తన శక్తినిజెప్పి సంధిచేసికొమ్మని యుప
దేశించుటకు మాఱుగ నాతని సంధిచేసికొనవద్దనియు, నీయుద్ధ
భారమును నేనువహింతుననియు,భీతిల్లఁ బనిలేదనియుఁ జెప్పుట
స్వామిభక్తుఁడగువానికిఁ దగునా? ఒకపక్షమునఁ దానర్జునునిచేఁ
బ్రాణములను దుర్యోధనునికార్యమున విడిచి శుద్ధుఁడగుట తన
కుచితమని తలంచినను నట్లుతలఁచుట దుర్యోధనుని నాశనమున
కంగీకరించుట కాదా? అని కొందఱు శంకింతురు. * కాని యీ

* ఆంధ్రభారతమున నీవిషయమున నిట్లుచెప్పఁబడియున్నది. మఱియు
నిట్టిమాటలు ధృతరాష్ట్రుఁడు పలికినట్లు వ్రాయఁబడెను.

తే. బవరములు గావె విఱిగినబార సాఁప
వచ్చునే యొక్కరుండ విప్పచ్చుఁ దడరి
పసులఁ బెట్టించునపుడు నీబలము విఱుగ
దయ్యెనే నీవుఁ గర్ణుఁడు నచటలేర.

వ. అని రాధేయుదిక్కు మొగంబై మఱియు నిట్లనియె.

ఆ. నాఁటికొలఁదిగాదు నారాయణుఁడు నొగ
లెక్కఁ గెలన భీముఁ డేచినడవ
ననుజ తనుజ సహితుఁడై వచ్చు విప్పచ్చు
మార్కొనంగ వశమె మనకుఁ గర్ణ!

చ. బలమును దర్పము న్మెఱయు బంటుతనంబున నీవు పాండవే
యుల నని మార్కొనంగఁ దగు టొప్పెడు తెంపగుఁ జచ్చి శుద్ధుఁడై
పలుకులు మాన్పు భృత్యుఁడను పాటిదలంచెద విట్లు మేలె యు
చ్చలమున నీసుయోధనుని చావునకోర్చుటగాదె యెంతయున్.

[భార. ఉ. 2 అ. 284. ప.]

వైరీతిని ధృతరాష్ట్రుఁడు పలికినట్లు సంస్కృతభారతమున నగపడదు.



విషయమునను గర్ణునియందు దోష మగపడదు. మహాభిమాని
యగు దుర్యోధనుఁడు తాను శత్రువులకు వెఱచి సంధిచేసికొనుట
కంగీకరింపలేదు. *కర్ణుఁడును దనప్రభువగు దుర్యోధనునియట్టి
దృఢాభిప్రాయము నెఱిఁగియే యట్లు పలికియున్నాఁడు. కావున
స్వామియగు దుర్యోధనుఁడును స్వామిభక్తుఁడగుకర్ణుఁడును దమ
పై నెత్తివచ్చినశత్రువులకు దైన్యముగను, పౌరుషహీనముగను
గొంతరాజ్యభాగ మిచ్చి సంధిచేసికొనుట యుక్తముగాదనియు
శత్రులను గెలిచి భౌతికశరీరముతో భూలోకసౌఖ్యముల ననుభ
వించుటగాని, శత్రులచేఁ జచ్చి నిష్కళంక మగుకీర్తిశరీరముతో
వెలసి స్వర్గసుఖముల ననుభవించుటగాని యుక్తమనియు, దృఢ
ముగా నిశ్చయించికొని రనిచెప్పవచ్చును. ఒకప్పు డట్టి నిశ్చ
యమునుండి చలించునట్లు దుర్యోధనుని వెఱపించి సంధి కంగీ

కర్ణుఁ డర్జునుని జయించెదనని పలుకఁగా భీష్ముఁడు కర్ణుని నిరాకరించినట్లును
నందుల కలిగి కర్ణుఁడు భీష్మయుద్ధకాలమున శస్త్రసన్యాసమును బ్రతిజ్ఞచేసి
నట్లును నున్నది. "ఉవాచ కర్ణో ధృతరాష్ట్రపుత్రం...పార్థాన్ హనిష్యామి
మమైష భారః, ఏవం బ్రువంతం త మువాచ భీష్మః కిం కత్థసే కాలపరీతబుద్ధే
...కర్ణః. అహం యదుక్తం పరుషం చ కించిత్ పితామహ స్తస్య ఫలం శృ
ణోతు,న్యస్యామి శస్త్రాణి నజాతుసంఖ్యే...త్వయిప్రశాంతే తుమమప్రభావం
ద్రక్ష్యంతు సర్వే భువి భూమిపాలాః."

(భార. ఉద్యో. యానసంధిపర్వము 61 అధ్యాయము.)

*క. ఒక్కఁడెసురపతికైనను, మొక్కము నృపధర్మమూఁదిమొనతలఁబడిన
మిక్కిలి పేరును నిట దిపి,నక్కజముగఁబెంపుఁబడయనగుట నుపేంద్రా!

[భార. ఉ. 3 అ. 38. ప]

అని దుర్యోధనుఁడు శ్రీకృష్ణునితోఁ జెప్పియున్నాఁడు.

కరింపఁజేయు ప్రసంగములు వచ్చినపుడు తనస్వామి యందుల కంగీకరించి కీర్తిశరీరమును గళంకితముగఁ జేసికొనునేమోయను భీతి నది యనుచితమని స్వామిహితముగఁ గర్ణుఁడు ప్రసంగించినను బ్రసంగింప వచ్చును. క్షణభంగుర మగు భౌతికశరీరపు సౌఖ్యమునకై యాచంద్రతారముగ నుండవలసిన కీర్తిశరీరమును మాపికొనుట దుర్యోధనునకు హితముకాదని వీరపురుషుఁడగుకర్ణుఁడు తలంచుట యాతని స్వామిభక్తికి లోపమును గూర్పఁజాలదు గదా.

ఇఁక నర్జునుఁడు దనకన్నఁ బరాక్రమశాలియని చెప్పకుండుటయుఁ గర్ణున కొకలోపముకాదు. తనకు సంభవించిన భార్గవశాపాదిలోపములు దుర్యోధనుఁడెఱుఁగకపోలేదు. ఘోషయాత్రయందు నుత్తరగోగ్రహణమునందును గనఁబడిన యర్జునుని ప్రభావాతిశయము దుర్యోధనునకుఁ బరోక్షమున జరిగియుండలేదు. కర్ణుఁడు కవచకుండలములను గోలుపోవుటయు రహస్యకృత్యముకాదు. కావునఁ దనకును నర్జునునకును గలతారతమ్యవిషయమునఁ దా నెంత యెఱుఁగునో దుర్యోధనుఁడును నంతవఱకును నెఱిఁగియే యున్నాఁడు. తనకు సంభవించిన లోపములచేతను, నర్జునునకుఁగల శ్రీకృష్ణసహాయముచేతను, నొక పక్షమున నర్జునుఁడు తన్ను మీఱఁజాలినను నమోఘములగు సర్పముఖశరమును,నింద్రదత్తశక్తియు నెట్లు వమ్మగునని యాతఁడు తలంపనగును. ఒకటఁగాకున్నను నొకటనైన నర్జునుని వధింపనగు నని యాతఁడేకాక మానుషశక్తినిబట్టి యాలోచించెడువా రెవ్వరైన నూహింపకతీఱదు గదా! భూసురశాపము చొప్పునఁ దానర్జునుచేఁ జచ్చుట సంభవించినను దనసర్పముఖ



శరేంద్రదత్తశక్తులలో నొకటనైన నర్జునుఁడును జచ్చునని యూహించుట యసంభవముకానేరదు గదా! ఒండొరులశస్త్రములచే నిద్దఱును నేకకాలమున మృతులయినం గావచ్చును గదా! ఇట్టియభిప్రాయముననే కావలయును,దనప్రతిజ్ఞను మిత్రుఁడును బ్రభువును నగు దుర్యోధనుని మనోరథమును బూరించుటకుఁ బైరెండు సాధనములనే నమ్మికొని యాతఁడు చలింపకయుండెను. కర్ణునివైకల్యమును బూర్తిగ నెఱిఁగి యున్నను, దుర్యోధనుఁడు కర్ణునకుఁ గల పయిరెండు సాధనములె తనకు జయమునుగూర్చునని నిశ్చయించుకొనియుండెను.* (చూ 10ప్ర)

ఇంక భీష్మద్రోణులు పక్షపాతులయియాత్మమర్మములను శత్రులకుఁ దెలియపఱతు రనికాని పాండవులు యుద్ధధర్మముల నతిక్రమించి యనుచితకార్యములకు సాహసించి మాయలు చేసి యోధుల నందఱను జంపుదురనికాని యూహించుట మానుషస్వభావమునకు సరికాదు గదా! అయినను బయివిషయములు సయిత మాదుర్యోధనుఁ డాలోచింపకపోలేదు. "నా పక్షమువారు పక్షపాతముచేతను మాయచేతను జెఱిచి పాండవులకు జయముగల్గినఁ గల్గుఁగాక! నేను మాత్ర మెత్తివచ్చిన శత్రులకు వెఱచి సంధి చేసికొనఁజాల" ననికదా దుర్యోధనుఁడు తండ్రికిఁ దన నిశ్చయమును జెప్పియుండెను.♦

---

* వ. అర్జునుఁడు గలఁడని తలంచితేని.

గీ. కర్ణువడసిన యాశక్తికలుగఁ బోన, బ్రతుకవచ్చునె నరునకు నదియుఁ గాక
యతనిభీష్మాదిరథికులయతులితాస్త్ర, మేయదివ్యబాణంబులును మింగికొనవె.

అని కదా దుర్యోధనుఁడు పలికియున్నాఁడు.

♦ఇట్లునుం గాక మాకు నెవ్వరును లేక చుట్టంబులును జెలులును విడిచి తోడువచ్చినవారును విచ్చిపోయి, భృత్యులును విరక్తులయి, వాకపోటు

కావునఁ గర్ణుఁడు దుర్యోధనునకు సంధి చేసికొమ్మని హితము సెప్పకుండుట యాతని కొక కొఱఁతయని యూహించుటయసంగతము. పరశురాముఁడు తన్ను శపించినను మరలఁ బ్రసన్నుఁడయి తన శస్త్రములఁ బ్రసాదించెననియుఁ దనకు గురుశాపములేదనియుఁ గర్ణుఁడు బొంకిన ట్లాంధ్రభారతమున నగపడుచున్నది. ఇదియె నిజమయినచోఁ గర్ణున కిది గొప్పలోపమని యంగీకరింపక తప్పదు. *

కాని యట్లాంధ్రభారతమున నేకారణముచే వ్రాయఁబడెనో కాని సంస్కృతభారతమునం దట్లుగ వ్రాయఁబడి* యుండలేదు. "నేను భృగువంశజుండనగు బ్రాహ్మణుఁడ నను

మానిసులును బంధుమిత్రసహాయులును బ్రజానురాగంబునుంగలిగినట్టిదైన నది ప్రాప్తకాలం బింతియ కాని యేమింక వారియెడుగు లోత్తను బాఱిపోవనుంజాలము. ఎల్లభంగుల సమరంబు సేయుదము. తలపెట్టిన నాతలంచిన ట్లొండె వాసుదేవుండు తలంచినట్లొండె నయ్యెడు నెట్లైన మే లింతవట్టు నిర్ణయంబని పలికి మఱియు నిట్లనియె.

తే. కులములోఁదలవంపగుకూఁతుగుడువఁ, బంపఁజూచెద వొక ఘుఁబఱతురె ట్టె
వారుపై నెత్తివచ్చినఁబోరకోప, మునిన ధృతి చేటకాక పొందగునె చెపుమ.
(భారతము-ఉద్యోగపర్వము. 2 ఆ. 214-215 ప)

*క. గురునలుక నాకు నస్త్ర, స్ఫురణ మొకలెనఁద్రుు జనులు బొంకెది పూజా
పరత మొయి నమ్మనీశ్వరు, కరుణఁగొరలిమగుడఁబడయఁగాంచితిఁ బ్రీతిన్.
(భారతము-ఉద్యోగ. 2ఆ. 266 పద్యము.)

శ్లో. మిథ్యాప్రతిజ్ఞాయ మయా య దస్త్రం రామాత్ కృతం బ్రహ్మమయం పురస్తాత్, విజ్ఞాయ తే నాస్మి తదైవ ముక్త స్తేనాంతకాలే ప్రతిభాస్యతీతి. మహాపరాధే హ్యపి యత్ర తేన మహర్షిణాఽహం గురుణా చశప్తః



నసత్యవిషయము పరశురామునకు స్ఫురింపఁ జేసి కపటముగ బ్రహ్మాస్త్రమును సంగ్రహించినందుల కాతఁడు తెలిసికొని యాయస్త్ర మంతకాలమున నాకు స్ఫురింపఁబో దని శాప

శక్తః ప్రదగ్ధుం హ్యపి తిగ్మ తేజాః ససాగరా మప్యవనిం మహర్షిః. ప్రసాదితం హ్యస్యమయా మనోభూ చ్ఛుశ్రూషయా స్వేన చ పౌరుషేణ, తదస్తి చాస్త్రం మమ సావశేషం తస్మా త్సమర్థో౽స్మి మమైష భారః.
(ఉద్యోగ-యానసంధపర్వ, 62 అధ్యాయము. నాగర ప్రతి.)

ఆంధ్రమహాభారతమున నీవిషయముసయితము విరుద్ధముగ నేయున్నది. కర్ణునకు మృత్యుకాలమునందే యాయస్త్రంబు స్ఫురించుననియు వ్రాయఁబడెను. ప్రకృతస్థలమునఁ గల్పనమే మాఱినందున సంస్కృతభారతమున త్రియే యుండలేదు. వెనుక నుదాహరించిన సంస్కృతశ్లోకములకుసరిగ నిచ్చటియాంధ్రీకరణ (గురు నలుక...అను మొదలగునది) ముండలేదనుట స్పష్టమె కదా! కావున వేఱొక చోటనుండి ప్రకృతవిషయమునకు విరుద్ధమగు నాంధ్రీకరణము నుదాహరించెను. "ఆసంయమి గోపించి కపటంబున బ్రహ్మాస్త్రంబుఁ బరిగ్రహించి తది నీకు పలయుకాలంబునఁ దోఁపమియు మృత్యు వాసన్నంబయినం దోఁచుటయు, నాపద ముట్టినయెడ భార్గవాస్త్రంబు దోఁపకుండుటయుం గలిగెడు మని శపించె" (భార. కర్ణ. 2. ఆ 89 పద్యము పయినుదాహరించిన సంస్కృతశ్లోకమునుండి యిట్టియర్థము రానేరదుగదా! మఱియు మృత్యుకాలమందు మాత్రమే భాసిల్లు నస్త్రమున్నమాత్రమున నీయుద్ధభారము నాదనియు, నేనే నిర్వహించెదననియుఁ గర్ణుఁడు పలికియుండఁడుగదా! కర్ణుఁడు మృత్యుకాలమునందే కాక యితరకాలమునందును బ్రహ్మాస్త్రమును బ్రయోగించియున్నాఁడు. కాఁబట్టి మృత్యుకాలమునందు మాత్రమే స్ఫురించునని యాంధ్రీకరించుట సరిగాలేదు. పయియాంధ్రీకరణమునకు మూలమగుసంస్కృతమునందును నంతకాలమువఱకు మాత్రమె స్ఫురించుననియె యున్నది. 'నూలో

మిచ్చియున్నాఁడు. నేనీవిషయమున గొప్ప యపరాధము చేసి యున్నను నాగురువగు నమ్మహర్షి సాగరసహితమగుభూమినెల్లను దహింపఁజాలినతేజస్సు గలవాఁడయినను నాశుశ్రూష చేతను నాపౌరుషముచేతను నాయందుఁ బ్రసన్నుఁడయి యుండుటచేఁ గావలయు నంతస్వల్పమగు శాపము నిచ్చియుండెను.

వధావాప్తమిదం తవాస్త్రం కస్మిన్కాలే ప్రతిభాస్యతి త్వాం అన్యత్ర తు స్యాత్ త్వద్వధ మృత్యుకాలాదబ్రాహ్మణే బ్రహ్మ నహి ధ్రువం స్యాత్. తదద్య పర్యాప్తమతీవ శస్త్రం అస్మిన్ సంగ్రామే తుములేఽతీవ భీమే......ధనంజయం మృత్యుముఖం నయిష్యే" అనియున్నది. (కర్ణ. 37 అధ్యాయము. నాగర ప్రతి) ఇచ్చట నయితము మృత్యుకాలేతరసమయములనుండునని యుచెప్పఁబడినది. కావున నే "ఆయస్త్రమిప్పుడు సమర్థమయియున్నది. దానిచే నర్జునుని వధించెద" అను వాక్యము సంగతి నొందుచున్నది. శాంతిపర్వమునందును నిట్లె సంస్కృతమున నున్నది. "యస్మాన్మిథ్యోపచరితో హ్యస్త్రలోభాదిహ త్వయా, తస్మాదేతన్న తే మూఢ బ్రహ్మాస్త్రం ప్రతిభాస్యతి అన్యత్ర వధకాలాత్తే సదృశేన సమేయుషః, అబ్రాహ్మణే నహి బ్రహ్మ ధ్రువం తిష్ఠేత్ కదాచన గచ్ఛేదానీం న తే స్థానం అనృతస్యేహ విద్యతే, న త్వయా సదృశో యుద్ధే క్షత్రియో భవితా భువి" అనియున్నది. (భార. శాన్తి. 13 అధ్యా. నాగర ప్రతి) వ్యాఖ్య--"యస్మాదితి. హే మూఢ, తే, ఏతత్ బ్రహ్మాస్త్రం వధకాలాదన్యత్ర న ప్రతిభాస్యతీతి, కింతు వధకాల ఏవ న ప్రతిభాస్యతి, కాలాంతరే తు ప్రతిభాస్యత్యేవేత్యర్థః. తేన ధ్రువం భూతస్య; సదృశేనార్జునాదినా కేన పుంసా స్థితే సమేయుషః యుధ్యమానస్య, 'సమిత్యాజిసమిద్యుధ' ఇతి సంపూర్ణస్య ఇణో యుద్ధార్థకతాదర్శనాదితి; ధ్రువం మరణావధనతిష్ఠేత్, బ్రహ్మ బ్రహ్మాస్త్రమ్" అనియున్నది. కావున నీవిషయమునఁ దిక్కయజ్వాంధ్రీకరణము మూలమునను సరిగా లేదని చెప్పక తప్పదు.



కావున నాకుఁ దన్మహర్షి ప్రసాదించిన బ్రహ్మాస్త్రము సావశేషముగఁ గలదు గాన నేను బాండవుల జయింపఁ జాలుదును. ఈ యుద్ధభారము నాది" అని నిజమును స్పష్టముగాఁ జెప్పి ప్రసంగించినట్లు సంస్కృతభారతమునఁ గలదు. దీనిని బట్టి పరశురాముని శాపమువలనఁ దనకుఁ గొఱంతలేదనియు, బ్రహ్మాస్త్రము బ్రదికి యుండవలసినంతకాలమును స్ఫురించునపుడీక నెట్లును జచ్చుసమయమున స్ఫురింపకున్న నేమిలోపమనియు, నాతఁడు ప్రసంగించినట్లు తేలుచున్నది.

అట్లు ప్రసంగించినకర్ణుని ప్రసంగముల పై నలిగి భీష్ముఁడు సంధి కుదురకుండుటకుఁ గర్ణుఁడే మూలకారణమని తలఁచి యాతనిని మిక్కిలిగఁ దూలనాడి యాతని సర్పముఖశరేంద్రదత్తశక్తులు శ్రీకృష్ణునిచే భగ్నములు కాఁగలవని చెప్పుచు నిరసించెను.* పిదపఁ గర్ణుఁడు కోపించి యట్లు కేవలముఁ దన్నుపై ద్వేషించుచున్న భీష్ముని నిరాకరించి యాతఁడు యుద్ధభారమును వహించి యున్నంతవఱకుఁ దాను యుద్ధముచేయ నని ప్రతిజ్ఞపట్టి యస్త్రసన్న్యాసము చేసెను. పరస్పరవిరోధముగల యోధులొకపక్షమున నుండి యుద్ధము చేయుట దుర్ఘటము గదా!

* ఈ సందర్భమున భీష్ముఁడట్లు నిరసించిన పైని ధృతరాష్ట్రుఁడును గర్ణుని దూలనాడఁగా నాతఁడస్త్రసన్న్యాసమును జేసెననియాంధ్రభారతమున నున్నది గాని యదిసంస్కృతభారతమునకు సమ్మతముగాదు. ఈవిషయమును మీఁదను వ్రాసియే యున్నందున నిచట మరల వివరింపలేదు.

ఒకానొకప్పుడు దుర్యోధనుని ప్రార్థనము పైని గురు పాండవయోధులలో నర్ధరథమహారథాతిరథాది విభాగముచే యుచు భీష్ముఁడు గర్ణునర్ధరథుఁజేసి తూలనాడినపుడు కర్ణుఁడు కోపించి భీష్ముని యనుచితప్రసంగము నుద్ఘాటించి శత్రుల నుబొగడుచు స్వపక్షమును నిరసించుచున్న పిఱికి వగునీవే యర్ధరథుఁడ వనఁదగియున్నా వని నిందించుచుండఁగా దుర్యోధనుఁ డుభయులను బ్రార్థించి శాంతింపఁ జేసెను. నిజము నారయఁగాఁ గర్ణుఁ డిట్లసమర్థుఁడని చెప్పినచో దుర్యోధనుఁడు సంధి కంగీకరించునని తలఁచి లోకోత్తరచరిత్రగలవాఁ డయ్యు, భీష్ముఁ డిట్టిరీతిని బ్రసంగించె నని తోఁచుచున్నది. ఈవిషయమును భీష్ముఁడంపశయ్యపైఁ బడిన పిదపఁ గర్ణుఁ డాతనిజూడఁ బోయి నప్పుడు వెల్లడించి యున్నాఁడు. * వేయేల ? పిఱికిపందయగు

క. నీదెసఁ గోపింతునె కుల
భేదముగాఁ బలుకుటయునొ బిడ్డలఁ జెఱుపన్
గాదని కినియుదు లేదన
రాఁదలఁతును నిన్ను నిష్ఠురంపుఁ బలుకులన్.
అది శిక్షగాని రోషంబు గాదు.

క. నీయుదయము దైవికగ
ర్భాయత్తము నీకు మర్త్యు లసదృక్షులు గాం
లేయుఁడవు గాని విను రా
ధేయుండవు గావు నీవు ధీరవిచారా!

(భార: భీష్మ. 3 ఆ. 441 మొ 448 పద్యాంతము.)



నుత్తరుని మహారథుఁడని చెప్పినభీష్ముఁడు కర్ణుఁడర్ధరథుఁడని తలంచునా? ఈవిషయమునందనేకులు భీష్ముని సమ్మతింపకున్నారు*

---

## పదియవప్రకరణము.

— కర్ణునివిజయములు, పాండవపరాజయము, శల్యునియనౌచిత్యము —

కురుపాండవయుద్ధమునందు మొదట భీష్ముఁడును, దరువాత ద్రోణుఁడును గౌరవసైన్యమునకు సేనాధిపతులైరి. వారు పక్షపాతమునఁ బాండవులకు నిజవధోపాయము నెఱిఁగింపఁగాఁ బాండవులు తదుపదేశానుసారముగఁ గపటోపాయములతో వారిని వధించిరి. వారికిఁ బిదపఁ గర్ణుఁడు సబహుమానముగ రారాజుచే సైన్యాధిపత్యమున నియోగింపఁబడెను.

* ఆ. కర్ణు నర్ధరథుఁడుగఁ బలుకుటయు నాజి
ధర్మసుతునితోడఁ దాను జచ్చు
తెఱఁగుఁ జెప్పుటయును గుఱితింప గాంగేయు
పక్షపాతబుద్ధి బయలు పఱచె.

ఉ. ఉత్త ప్రగల్భముల్ పలుకునుత్తరుకంటెను భారతమ్ములో
నెత్తఱిఁ బంద గానఁబడఁ డెవ్వఁడు వీనిని నిండుకొల్వులో
నెత్తి మహారథుండనియె నీకునువృద్ధుఁడు వానికంటె లో
కోత్తరుఁడైనకర్ణుఁ డసవో తన నర్ధరథుండ టంటఁడే.

(రామకృష్ణకవులు. సాహిత్యపరిషత్పత్రిక. ప్రమాదీచ సంవత్సరము, ఆషాఢమాసము, కౌరవగౌరవము) - (చూ. ఉపోద్ఘాతము, 9-10 పుటలు)

భీష్మసైన్యాధిపత్యకాలముతోఁ గర్ణుని యస్త్రసన్న్యాస ప్రతిజ్ఞ ముగియుటచే నాతఁడు, భీష్ముఁడు పడినతోడనె యుద్ధమునకుఁ బోఁదలఁచి యొకసారి భీష్ముని జూడఁబోయెను. అట్లు భీష్మునిదరి కేఁగి నమస్కరించి "అయ్యా! నాపైఁగోపమునువిడువుము. నన్ను యుద్ధమునకుఁ బోవ నియోగింపుము" అనివిన్నవించెను. అపుడు భీష్ముఁ డచ్చటిసేవకుల నావలకుఁబో నియోగించి కర్ణు నాదరించి యిట్లు రహస్యముగఁ బ్రసంగించెను. "ఓయీ కర్ణుఁడా! నీవు రాధాపుత్త్రుఁడవుగావు. కుంతికిఁ గన్యాత్వమున సూర్యుని ప్రసాదమున జన్మించినవాఁడ వగుటచే నీవును పాండుపుత్త్రుఁడవే యనఁదగుదువు. ఈ దేవరహస్యము నాకు వ్యాసమహాముని చెప్పియున్నాఁడు. కావున నీయందు నాకు వాత్సల్యమెగాని కోపమేమియు లేదు. కురుపాండవులకు సంధి కాకుండుటకు నీవే మూలకారణ మగుటచే నేను నిన్నుఁ బలుమాఱు నిరసించుచు వచ్చితిని గాని వేఱుకారణములేదు. నీకు సమానుఁ డగు పురుషుఁ డీలోకమున లేఁడు. నీవు నాబుద్ధి విని పాండవులలోనికిఁ బొమ్ము. వారు నావలన నెఱిఁగి నిన్ను గొలిచెదరు. నీవే యీసామ్రాజ్యము ననుభవింపఁ గలవు." అని యిట్లు ప్రసంగించిన భీష్మునిప్రసంగములు విని కర్ణుఁడు తాను పాండవులలోఁ గలియరాకుండుటకుఁ దగినకారణములను మున్ను శ్రీకృష్ణునితోడను గుంతితోడను విన్నవించినట్లు విన్నవించి యాతనియనుమతి నొంది యుద్ధభూమికిఁ బోయెను. కర్ణుఁ డిప్పుడైనఁ బాండవులలోనికిఁ బోయిన దుర్యోధనుఁడు సంధికంగీకరించునని గదా పాపము! భీష్ముఁ డిట్లుపదేశించెను. ద్రోణాచార్యుని సైన్యాధిపత్యకాలము మొదలుగఁ గర్ణుఁడు



తనపరివారముతో యుద్ధమునకు బయలు వెడలి పాండవసేనలలో ననేకయోధులను నురుమాడెను; కాని యీయుద్ధములందుఁ గర్ణుఁడు పరాజయములను గూడ నొందకపోలేదు. కవచకుండలములను గోసి యిచ్చుటయె యిందులకుఁ బ్రబలమగు కారణమని తోఁచుచున్నది. ఒకానొకప్పు డర్జునశిష్యుఁ డగు సాత్యకితోడను, వేఱొకప్పుడు భీమసేనునితోడను, యుద్ధముచేసి యోడిపోయెను. మఱియొకప్పు డభిమన్యుని శౌర్యమున కోహటించుటయె కాక ప్రచ్ఛన్నముగ నుండి యాతనివింటిని విఱుగఁగొట్టెను. ఇంతియ కాక యనేకులగు బంధుమిత్త్రులను మహావీరులగు సత్యసేన వృషసేనాదిపుత్త్రులను శత్త్రువులు వధించునపుడు చేయునది లేక యూరకుండెను. వేయేల? యువరాజగు దుశ్శాసనుని భీముఁడు ఘోరముగఁ జంపుచున్నపుడును, నర్జునరక్షితుఁడగు నాభీముని నేమియుఁ జేయలేక పోయెను. అట్టిసమయమున నర్జునునిం దలపడుతనపుత్త్రుండగు వృషసేను నర్జునుఁడు వధించుచుండ నిశ్చేష్టుఁడయి యూరకుండెను. ఇట్టియవసరములందు శూరశిఖామణి యగు కర్ణుఁడు వెనుదీయుట కాతనిశరీరమెల్లఁ గవచపరిత్యాగమున క్షతమగుటయే కారణమని దృఢముగాఁ జెప్పవచ్చును. మఱియు యుద్ధములలో నెట్టివారును జయపరాజయంబులను బర్యాయంబునఁ బొందుచుండుట వింత కాదు. ఇంతియ కాక యోధులు కొందఱు మహావీరులతో యుద్ధముచేసి యలసియుండునపుడు వాని నితరుఁ డశ్రమమున జయించుట సంభవించుచుండును. ఇంతయేల? అక్షయతూణీరములును, నకుంఠధనువును, నవధ్యరథ్యములును, దివ్యరథంబును,

నారాయణసారథియుఁ గల యర్జునుఁడే భీష్మద్రోణకర్ణులు తన బంధుమిత్రులను నరుకుచుండు సమయములందు వెనుదీసి చేయునది లేక యూరకుండెను.

అట్లె కర్ణుఁడును గొన్ని సమయములందుఁ బరాజయముల నందినను బలుమాఱు పలువిధంబు లగు జయముల నందుచు వచ్చెను. ద్రోణాచార్యసైన్యాధిపత్యకాలమున నొకనాఁడు భీముని జయించి యాతని చావాసన్నమగునపుడు కుంతికిఁ దానొసఁగిన వరమును స్మరించి యాతని వధింపక విడిచి "తిండిపోతా! నీకును నాతో యుద్ధమునకుఁ దలపడనగునా?" అని పరుషోక్తు లాడి పరాభవించెను.*

---

*క. మనమునఁ గుంతీవాక్యం, బును దలఁచి నేయుటుడిగి పోయి కదిసి న
వ్వున మోమొప్ప నదని క్కి, ట్లను వింటం గొనుపులీల నల్లఁ బొడుచుచున్.

ఆ. తిండిపోత నీకు భండనం బేటికిఁ, గడవఁ జేసి కుడుచు కాంక్ష గల
నోపుకొలఁది మ్రింగ యూరక నీ వింటి, కడన యుండుమింక నడిచి పడక.

వ. అని మఱియును.

క. వనమున ఫలమూలంబులు, దిని ముని వై యుండఁ గాక ఘోరద్ధతి వై
నని సేయ నీకు వచ్చునె, చను మటకిఁ గుడిగ మడిఁగ గాంగేయు పోలెన్

వ. అట్లు నీవును లుండవేని.

క. చేయలఁతిగని సమరము
సేయుము సనుబోఁటికోడఁ జెనయుట ననా
రాయణులు వారు యిటికిఁ
బోయెదవేఁ బోయి బ్రదుకు పొంక ముడుగుమీ.

(భార. ద్రోణ. 4 అ. 238 మొ. 243 వఱకు)



నేఁటొకసమయమున సహదేవు నోడించి చావమోది యాతఁడు చావనున్నప్పుడు కుంతివరముం దలంచి యాతనిని భీమునట్లె యవమానించి విడిచి పుచ్చెను.*

ఒకప్పుడు ఘటోత్కచుండు మాయాయుద్ధమున విజృంభించి కురుసేనలను మర్దించుచుండ వాని బారినుండి తప్పించుకొనుటకు నుపాయాంతరము లేక దుర్యోధనాదు లెల్లఁ బ్రార్థింపఁగాఁ గర్ణుఁ డింద్రదత్తశక్తిని బ్రయోగించి వానిని సంహరించెను.

---

*"వ. ఇట్లు సహదేవుం బొదివి రాధేయుండు.

చ. దయమున విల్లు ద్రుంచినఁ బరాక్రమ మొండొకవింటఁ జేయఁగా
హయముల సూతుఁ జంపుటయు నాతఁడు ఖడ్గము ఖేటకంబు ని
ర్భయముగఁ బుచ్చుకొన్న బహుబాణములం దునుమాడె నవ్యసు
గ్జయ మగు లావునం గడునెసఁగ గదవైవ నడంచె నవ్వుచున్.

వ. దానం జెందు పడక యప్పాండవనందనుండు.

ఆ. శక్తివైవ నిశితచక్రంబు నిగిడింప, వరుస నదియు నదియు వ్యర్థ లయ్యెఁ
దునియలయ్యె నేలఁ దొరఁగంగఁ జేసి పెల్లేసి తెగలుటయును నెవ్వె నతఁడు.

ఇత్తెఱంగునఁ గర్ణుండు గదిసి నిశ్చేష్టితుం డగు సహదేవు నాలోకించి కుంతిమాటలు దలంచి యొండు సేయనొల్లక యల్లన వింటికొప్పునం గడుపు వొడిచి నవ్వుచు నెక్కుడైన పగఱ నెక్కు నందఁ బడకు మల్లవాఁడె నరుండు గురుసేనతోడ బిరుదై పెనంగెడు నతనికడకుం బొమ్మని పలికి పోయె నక్కుమారుండును నట్లు కర్ణునేటులను మాటలను గడునొచ్చి తన బ్రతుకు నను నిందించుచుఁ బోయి వేఱొక్క రథం బెక్కె."

(భార. ద్రో. 5. అ. 158. మొ. 161. వఱకు.)

ఈయమోఘశక్తి నర్జునునిపైఁ బ్రయోగింపు మని ప్రతిరాత్రియు దుర్యోధనాదులు కర్ణునితోఁ జెప్పుచుండుటయు నాతఁ డట్లు చేసెదనని పల్కుచుండుటయు జరుగుచుండెను; కాని యుద్ధసమయములందు శ్రీకృష్ణునిమాయచే దానిం బ్రయోగింత మనుబుద్ధి కర్ణునకును, బ్రయోగింపఁ బ్రేరించు బుద్ధి కౌరవులకును నంకురింపకుండెను. పరాత్పరుఁ డగు శ్రీకృష్ణుఁడు సహాయుఁడై యుండఁ బాండవుల కెట్లాపదలు సంభవించును? దేనిని నమ్ముకొని యర్జును వధించెదనని కర్ణుఁడు దుర్యోధనునకు వాగ్దానముచేసియుండెనో యమ్మహాశక్తి నిట్లువినియోగింపఁ జేసి యర్జునుఁ డపుడు బ్రదికినట్లుగఁ దలంచి శ్రీకృష్ణుఁ డానందించెను.

---

*అచ్యుతుం డతని కిట్లను నింద్రుండు కుండలంబులు గొనుచుండి కర్ణున కిచ్చినశక్తి యతనికడ నున్నంతకాలంబును నిన్ను బ్రదికించుట దుష్కరం బని తలంచుచుందుదు. నేఁడు హిడింబానందనుమీఁద నది వోయినం బ్రమోదంబు నొందితి. నాసూతనందనుం డది చేతనుండె నేనిఁ జక్రగాండీవధరులమై మనమిరువురము గదిసితి మేనియు జయింపను సతండు దేవసన్నిభుండు దివిజపతి వేఁడినఁ గవచకుండలంబులు వికృత్తంబులు సేసియిచ్చుటనైకర్ణుండసంబరఁగె. నీకై మీతండ్రి యిట్లు సేయఁడయ్యెనేని వాని కెదు రెవ్వరు. కవచకుండలవిహీనుండై మానవసామాన్యంబునొందుటను శక్రదత్తసాధనంబు లేమిం జేసియు నింక నీవు గెలువవచ్చు......అప్పుడు సాత్యకి శౌరితో నాసూతసుతుం డీశక్తి యన్నిదినంబులు ధనంజయుమీఁదఁ బ్రయోగింపమికిఁ గారణం బేమి యని యడిగిన నతఁడు.

తే. వానివారెల్లనీపనివానికెపుడు, గఱపుదురు వాఁడు బూన్కిమైఁ గడగివచ్చు
దాసదల నేను వారందఱును మఱచు, నట్లు సేయుదు నరునకు నైనమార



ద్రోణాచార్యుఁడు గతించినవెనుక సైన్యాధిపత్యముం బడసి ద్విగుణీతోత్సాహుండై కర్ణుఁడు పాండవులను బలుమాఱుఁ బరాభవించి విజృంభించుచు వచ్చెను.

ఒకప్పుడు నకులుఁ డెదిరించిన నాతని నశ్రమంబున నోడించి యాతఁడు సిగ్గువిడిచి పాఱుచుండ నాతనిమెడకు వింటిని దగిలించి వెనుకకు లాగి యవమానించి కుంతికిఁ దానిచ్చినవరముం దలంచి విడిచిపుచ్చెను.*

ఈరీతిని నిరుపమానపరాక్రమంబున నర్జునేతరు లగు పాండవుల జయించి పరాభవించియుఁ దనివి నొందక యర్జును సమోఘరథరథ్యధనుస్తూణీరసారథులం దలంచి తనకుఁ దగిన సారథియైన లేక యాతని గెల్వం జాల నని యెంచి యవ్విషయము దుర్యోధనున కెఱింగించెను. దుర్యోధనుఁడును గర్ణుని యనుమతంబున శల్యునిఁ గర్ణసారథ్యమున కంగీకరింపుమని ప్రార్థించెను. శల్యుఁడును దాను ధర్మరాజున కిచ్చినవరమును నెఱ

---

చ. పలుకయు వాలునుం గొనియెఁ బాండుకుమారుఁడు పెక్కుచెక్కలై
యిల దొరుగంగ నేసి గద యెత్తినఁ దుంచె రథంబు డిగ్గియు
జ్జ్వలపరిఘాభిరాముఁ డయివచ్చిన నప్పరిఘంబు రూపుమా
పె లసితలాఘవస్ఫురణ పెంపునఁ గర్ణుఁడు నొంచె నాతనిన్.

ఆ. మన్మథాదు లయిన మార్గణంబుల కోహటించి సిగ్గుఁ జలము డిగ్గ ద్రావి
యొల్ల జనులుఁ జూడఁ బొల్లఁదనంబున, గొంచ యక్కుమారుఁ డోడిపాఱె.

క. వెనుకొని రాధేయుఁడు నిజ, ధనువాతనికంధరమునఁ దగిలిచి నవ్వి బ,
ట్టిన నింద్రచాపపరిగత, ఘనాకృతిని బోలె నతఁడు కౌరవనాథా.

(భారతము కర్ణ. 132 మొ. 13[illegible] వఱకు)

వేర్పు నవసరము దటస్థించినందులకు సంతసించియు వెలిపుచ్చక తోలుదొల్త నక్కార్యమున కిష్టములేనివానివలె నటించి తుదకుఁ దానెన్ని పరుషోక్తులాడినను గర్ణుఁడు సహించున ట్లొడంబఱిచి సమ్మతింపఁజేసెను.

అది మొదలుగఁ గర్ణుఁ డుత్సాహోద్రేకముతోఁ దలపడు సమయములం దెల్ల నర్జునభుజావిక్రమముం బొగడియు ఘోషయాత్ర యుత్తరగోగ్రహణము మొదలగు సమయములందుఁ గర్ణునకుఁ గల్గిన యపజయంబుల నుగ్గడించియు, హంసకాకీయోపాఖ్యానము చెప్పి తదుపమానమున నిరసించియు, నాతని నిరుత్సాహునిగాఁ జేసి శల్యుఁడు పాండవులకు గాపాడుచుండెను

*క. కోలఁది యెఱుంగక కృష్ణులఁ
గలనం గెలుతు ననియెదు నీవు గంటివె సింగం
బుల నెత్తఱి నైనను నే
పొలమున నేనియును నక్క పోరి గెలువంగన్.

తే. కొంతికొడుకును దేవకికొడుకు మనము
గనియెదము దినకరనిశాకరులుఁ బోలె
వెలుఁగ నయ్యెడ ఖద్యోతవిలసితంబు
తోడి దగుఁగాక నీ పెంపు తోఁపఁ గలదె.

చ. విరటుని గోవులన్ మరల దెల్చి మతంబున నీదుతమ్ము నిం
బొరిగొనఁ బార్థుఁ డాఁక కెటుపోయితి నాఁ డలఘోషయాత్రలోఁ
గురుపతి డించి క్రీడి కృపనం దగు పాత్రము సేసి యొక్కరుఁడన్
నురిగితి చెప్పుమా నిజము సూతతనూభవ; నాకు నేర్పడన్

క. అరిగితి నే నిను నాఁ క
ష్టాగ్ని భుజబల మెట్టిదని యవారణ నీ వి



చదువరులారా! కలదా యెచ్చటనైన సారథి రథికు నట్లు వేఁపుట? "ప్రాయ స్సమాపన్నవిపత్తికాలే ధియోఽపి పుంసాం మలినీభవన్తి" అను చొప్పున నీతివిదగ్రగణ్యులయ్యుఁ గాలవశంవదులయి కర్ణదుర్యోధనులు శత్రుపక్షమువాఁ డగుశల్యుని స్వపక్షమునఁ జేర్చుకొని హృదయమునఁ జేసెత శల్యము నాటికొనిరి. అరయనరయ నీసందర్భములోని శల్యధర్మజుల నడవడి కర్ణునకు యశఃపతాకిక కాకపోదు.

ఒకప్పుడు కర్ణుఁ డొడ లెఱుంగనితమకంబునఁ గుంతీవరమును సైతము మఱచి ధర్మజునకు సహదేవులు ముగ్గురపై నొక్కపెట్టునఁ దలపడి వారిని సమయింప నున్నప్పుడు శల్యుఁడు సమయోచితముగఁ బ్రసంగించి కర్ణునరదమును వేఱొక్కచో

ప్పుడు నృపులెల్లను విన వా
విడచి పోగడే దిట్టు వందివిధమున నతినిన్.

క. దృష్టాంతము సెప్పెద నని, కష్టాత్మా! నీవు నన్నుఁ గాకము నరు ను
త్కృష్టమరాళముఁగాఁగ ని, కృష్టపుఁగథఁ జెప్పితివి సభాస్థ్యము తెలియఁగ.?

తే. విల్లువట్టెడువారికి నెల్ల నెక్కుఁ
డనఁగ నెగడిన గాండీవి నాహవమున
దొడరఁ బ్రాణంబులకు నాసపడకు లయుపఁ
కారులకు వచ్చునే నాకుఁ గాక శల్య!

వ. అని విని యమ్మద్రపతి వీని యంతరంగ ... కలంగి.....ఇక్కరంకి యే నీరజ్జులానికి నర్జునగుణవిశేషంబు లెఱింగించి ముదం బడంచిన కలం బునఁ గలిగెఁ గొంతేయాగ్రజునకు నాయిచ్చిన వరంబు సఫలం బయ్యె నని మనంబునఁ దలంచె. (భార. కర్ణ. ౨. ఆ. ౪౨౮ ప.)

టికిఁ గొనిపోయి ధర్మరాజాదుల పలాయనమునకు సందుచేసి వారి నమ్మహావిపత్తునుండి యుద్ధరించెను.

---

*ఆ. వలుద నారసంబు వక్షంబు దూఱంగ
నేయుటయును బాండవేయుఁ డార్తిఁ
గూరి నిలువలేక కూర్చుండఁ బడి సూతు
నరద మొగపు దొలఁగ ననియె నధిప!.

వ. అనుటయు నాఁ డట్లుచేయం గౌరవులు గడంగి పోనీక పొదువుండను నె
లుంగులతో నక్కౌంతేయాగ్రజు వెన్నాడి కవిసిన........

క. ఇరుదెసల నున్నకవల, న్నరపతి సురవస్థనూవి నారాచపరం
పరలు పరగించుచును జె, చ్చెరఁ గర్ణుని దాఁకె రతఁడు చిఱునవ్వొలయన్

తే. వారలిరువుర నుగ్రంపు నారసములఁ
గప్పి దంతవర్ణములును గాళ్వాల
సుందరంబులు నగు ధర్మనందనుని తు
రంగమంబులఁ బడనేసి గయము మెరయు.

క. అతని శిరస్త్రాణంబును
శితవిశిఖనిపాతితంబు సేసి యుదాగ్రో
ద్ధతి నపలు కార్ముకము హయ
తతియుం దునుమాడుటయు నతండును నతఁడున్.

క. సహదేవుని తేరక్కి-న, నహితాంతకుఁ డైనకర్ణుఁ డమ్మువ్వుర సం
పహితశరీరులఁ జేసెను, బహువిధబాణములఁ జలము బలమును మెరయన్

చ. కనుఁగొని శల్యుఁ డిట్లనియెఁ గర్ణునితో నిదియేల ధర్మనం
దనుపయి నాగ్రహించెదు హితంబగు కార్యమె యిమ్మహీశు నీ
వనిఁ దెగటార్చినట్లయిన నర్జునుఁ దక్కటి శోకరోషముల్
పెనఁగొన నిన్నుఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు సేయకుండునే?



కర్ణుని యుత్సాహసమయముల నెల్ల నిట్లు వృథచేయుచుఁ బరుషభాషణముల నాతని నిస్తేజునిగా నొనరించుచు ననుచితమని తలంపక శల్యుఁ డీరీతిని గర్ణునకు హృదయశల్యమై పీడించుచుండెను. అయినను వానిని గణింపక ధీరోదాత్తుఁ డగు కర్ణుఁడు మహోత్సాహముతో శత్రుసేనలను జెల్లాచెదరుగఁ గొట్టి రథగజతురగపదాతులఁ బీనుంగుపెంటలఁ జేయుచు యుద్ధభూమిని విహరించుచుండెను.

ఇట్లు పాండవులకుఁ దేఱిచూడరాక శత్రుదుర్నిరీక్షంబగు తేజంబున మండుచునొకప్పుడు భార్గవాస్త్రమును బ్రయోగించి పాండవబలంబులను మలమలమాడ్పసాగెను. అమ్మహాస్త్రము

---

తే. ఇతఁడు దెగటాఱె నేనియు నేమిఫలము
గలదు నరుఁ బొలియించుట యలఘుశౌర్య
మది కురుక్షితిపాలున కఖిలరాజ్య
సిద్ధియును జేయు నింక నాబుద్ధి వినుము.

వ. అదియునుం గాక.

క. వాఁడె కురుక్షితిపాలుఁడు, పోఁడిమి సెడి భీముచేతఁ బొదువఁబడియె న
న్వాఁడిమగని కడ్డము నీ, వేఁడిమి దక్కంగఁ గలదె వేఱొకఁ డరయన్.

క. పవనసుతు చేత నాభూ, ధవుఁ డీల్గెనయేని నీవు ధర్మతనయునిన్
గవలన్ సమయించుట దలఁ, ప వృథాస్ఫురణంబు గాదె పరబలభేదీ!

క. అన విని యశౌత్తి భవ, త్తనయుని దెసఁ జూచి వాయుతనయునిచే నా
తని పొదువఁబడుటయేర్పడఁ, గని రాధాతనయుఁ డతనిఁ గావఁగఁ జనియెన్.

క. చనుటయు నజాతశత్రుఁడు, తనశిబిరంబునకుఁ జిన్నతమ్ముని యరదం
బున నతని నతనియన్నను, గొనిచనియెను సత్వరముగఁ గురుకుల ముఖ్యా.

(భార. కర్ణ. 2. ఆ 38 మొ)

పెక్కు రూపములతోఁ బాండవసేనలను దహించుచుండఁగా వాఁడు దిక్కు లేక నిలువఁజాలక ధైర్యంబును మానముతోఁడ విడనాడి పాండవపాంచాలయాదవబలంబులు పలాయితంబులయ్యెను. అట్టియెడ వానిని విడువక కౌరవబలంబు వెన్నాడిన హాహాకారంబుఁ జేయుచుఁ గృష్ణార్జునుల నుపలక్షించి "రక్షింపుఁడు రక్షింపుఁడు" అని మొఱవెట్టసాగెను.

అట్టి సమయమున నర్జునుఁడును గర్ణునెదిరింప నోడి "ఓయీ! శ్రీకృష్ణుఁడా! చూచితివా కర్ణునిపరాక్రమము? పొగలేని నిప్పువలె మండుచు రౌద్రావేశమునఁ దెంపుచేసి విక్రమించుచు నన్ను వెదకుచు నఱ్ఱెత్తి నలుగెలంకులు పరికించుచున్నవాఁడు. ఈసమయమున నోసరించి నేర్పుతో మరలుట మేలు గాని యీసు వహించి యెదిరించినయెడ మానప్రాణములు దక్కించుకొననగునా? ఇట్టియెడఁ దెంపుచేసి తలపడి చచ్చి సాధించున దేమి? ఓసరించి బ్రతికియుండిన సమయముచూచుకొని శత్రుజయము గాంచ నగును. జయార్థుల కిది కర్తవ్యము కాదా? మట్టమధ్యాహ్నపు సూర్యునిరీతిని మండుచున్న యీకర్ణు నిప్పు డెదిరింపఁజాలను. 'జీవన్ భద్రాణి పశ్యతి' అనునార్యోక్తి వినుముకదా! కావున నిప్పటి కీయుద్ధభూమినుండి రథమును మరలింపుము!" అని పలికెను. శ్రీకృష్ణుఁడును నర్జునరక్షాపరుఁ డగుటచే నప్పటి కోసరించి యట్లాడ లెఱుంగక విక్రమించి యలసి యలసియుండు కర్ణుని, విశ్రాంతినొందినయర్జునుఁ డెదిరించునట్లు చేయఁదలఁచి రణభూమినుండి రథమును



మరలించెను. మఱియు నట్లు పలుకునర్జునువిన్నఁదనమును గప్పిపుచ్చుటకై "అర్జునా! ఇప్పుడిట్టికర్ణునిబారిని బడిమిగులనొచ్చి యుధిష్ఠిరుఁ డింటికిఁ బాఱినజాడ యగపడుచున్నది. అతనిసేమ మారసి వచ్చుట యావశ్యకము" అని యొకనెపమును గల్పించి ధర్మరాజుశిబిరమునొద్దకు రథముం దోలుకొనిపోయెను.

అహా! కర్ణసారథియగు శల్యుఁ డారీతిని గర్ణు నుత్సాహస్మయముల వ్యయపఱిచి యసంగతము లగు పరుషభాషణముల నాతనిఁ గలంచుచుండ నర్జునసారథియగు శ్రీకృష్ణుఁ డీరీతి ననుకూలప్రవృత్తితో మెలంగుచు నాతనికి మనసుకంటెను బరమాప్తుఁడై మానప్రాణములం గాపాడుచు వచ్చెను. ఇట్టిస్థితిలోఁ గర్ణున కెట్లు జయము గల్గును?

అర్జునున కెట్లు పరాజయము సంభవించును?*

---

చ. కనుఁగొను మిప్పు డేను మొగసస్మరుఁ బార్థుని భీమసేనునిం
దునిమెద నస్త్రసంపదయు దోర్విభవంబును శౌర్యసారముల్
జనులకు నెల్లఁ దెల్లముగ నాదగుపూనిక పారమెయ్ది మే
దినిఁ గురునాథుఁ డొక్కఁడ యతిస్థిరసౌఖ్యత నేలునట్లుగన్.

వ. అని పలికి విజయంబు వీక్షించి గుణంబు సారించి గాండివంబు నీ కెదుటే యని యగ్గించి యప్పుడు పయిపయి నురవడించు పరసైనికులం జేయెత్తి యుదల్చి భార్గవాస్త్రంబుఁ బ్రయోగించిన నమ్మహనీయసాధనంబు.

శా. ఘోరానేకశరాకృతిం బరఁగి సంక్షోభంబు గావించుచున్
దేరుల్ గ్రుంగఁగ వారణంబులు ధరం ద్రెళ్ళంగ నశ్వాలి నూ
గై రక్తంబునఁ దేలఁగా భటచయం బత్యంతచూర్ణీకృతా
కారత్వంబు భజింపఁ గేళి సలిపెం గౌంతేయసైన్యంబునన్

వ. ఇప్పుడును భార్గవాస్త్రబాధితంబయి యప్పాండవబలంబు వెఱచఱచి మరలి పఱచిన మనమూఁకలు వెన్నాడి దఱుమ నాసూతనందనుండట్లేచి యార్చి యంటం దాఁకి విశిఖశిఖలు నిగిడించుచుఁ బొగలేనిమంటపగిదిఁ బ్రకీర్ణుండయినఁ దదుత్సాహంబున గోటువడి యాసైన్యంబు జనంబులు హాహాకారంబు లెసంగ దీనదశం బొంది ముకుందపురందరనందనులం బేర్కొని యాక్రందించి రట్టియెడ.

ఉ. గాండివి శౌరి కిట్టులనుఁ గర్ణుని జూచితె యేకవిక్రమో
ద్దండతఁ దెంపుసేసి బలుదర్పము సూపుచుఁ దేటచూడ రా
కుండెడు నట్లుగా నలుక నుగ్రతమండెడు నిష్ఠ నేర్పునై
నుండక యీనునం దొడరి యోటమి దెచ్చికొనంగ నేటికిన్.

క. చచ్చిన మఱిగెల్పు గొనన్, వచ్చునె తనయొడలు గలుగ వైరుల గెలువన్
వచ్చున్ ధృతివచ్చిన నది, మెచ్చు జయార్థులకు మరుదమిత్రధ్వంసీ!

తే. పట్టపగలింటిసూర్యుని పగిదిఁ గర్ణుఁ
డుగ్రమూర్తియై వెలుఁగుచు నున్నవాఁడు
మనరథం బిష్టు మాధవ! మగలనిమ్ము
బ్రతికియుండిన శుభములు పడయవచ్చు.

(భార. కర్ణ. 3. ఆ. 12 మొ. 18 ప.)

శ్లో. పశ్య కృష్ణ మహాబాహో భార్గవాస్త్రస్య విక్రమం,
నైతదస్త్రం హి సమరే శక్యం హంతుం కథంచన.
సూతపుత్రం చ సంరబ్ధం పశ్య కృష్ణ మహారణే,
అంతకప్రతిమం వీర్యే కుర్వాణం కర్మదారుణం:
అభీక్ష్ణం చోదయ న్నశ్వాన్ ప్రేక్షతే మాం ముహుర్ముహుః.

(భార. కర్ణ. 65 అధ్యాయము.)

పయిశ్లోకములోఁ జెప్పఁబడినరీతిని గర్ణుఁడు తన్ను వెదకుచున్నాఁడని యర్జునుఁ డెఱిఁగియుఁ బాఱిపోయినవిధ మాంధ్రభారతమున వర్ణింపఁబడలేదు.



## కర్ణునిపరాక్రమము

కర్ణుని వాఁడి నారసములచే మిగుల నొచ్చి ధర్మజుఁడు కనలతో శిబిరమునకుఁ బాఱిపోయె ననియు, నట్టి యుధిష్ఠిరు క్షేమముం దెలియునెపమునఁ గృష్ణార్జునులును ధర్మరాజుశిబిరమునకేతెంచి రనియు నీవఱకు విదితమైయున్నది గదా? అట్లు వచ్చిన యర్జునునిం గని ప్రాణావశిష్టుఁడై యున్న ధర్మజుఁడు శోకక్రోధపశ్చాత్తాపములు ముప్పిరి గొనుచుండ నీరీతిని బ్రసంగించెను. "ఓయీ! యర్జునుఁడా! నేనొక్కరుఁడ నేకర్ణుంజయించెద నని ప్రగల్భంబులం బలికితివి. అట్టినీవాక్యములనునమ్మి తెలివిమాలి దుర్యోధనునితో విరోధమును దెచ్చికొంటిని. నిజముగా నీవిట్టివాఁడ వని తెలిసిన ద్వైతవనంబు దాఁటివత్తునా? నీమూలమున బాంచాలమాత్స్యబలంబు లెల్ల మడిసిపోయెను. కర్ణునకు నేనోడి శత్రులు చూచి నవ్వుచుండ సిగ్గుమాలి రణభూమినుండి పాఱివచ్చి యిట్లు చులుకనైతిని. నేనొక్కరుఁడ నోడితిననఁ నేల? భీముండును నోడెను. కవలోడిరి. నీవును నోడి యిటులఁ బాఱివచ్చితివి. మనతోడ నీనారాయణుఁడును నోడెను. మారిమసఁగినట్లు కర్ణుఁ డుద్దండపరాక్రమముతోడ సేనల సమయించుచుండఁగాఁ జేతిలోఁ జేవగలయభిమానధనుఁడగు క్షత్త్రియవీరున కిపు డిట్లు శిబిరము చేరుట యర్హమా? పాపము! భీమసేనుండొక్కరుండె ప్రాణములం దాశవిడిచి బలంబునోదా

ర్చుచు రణభూమినుండి మరలఁజాలక నిలిచియున్నవాఁడు. దివ్యములు నకుంఠితములునగు నీరథరథ్యసారథిధనుస్తూణీరములు గాల్పనా? ఇంకనైన నాబుద్ధివిని నీవు సారథివై కృష్ణునకు గాండీవ మర్పింపుము. అతండు కర్ణుని వధించి మనలఁ గాపాడఁగలఁడు.

---

*క. విను కర్ణున కీనోడితి
నన నేటికి నీవు నోడి తనిలజమాత్రి
తనయులు మున్నె యోడిరి
మనతోఁ గూడంగఁ గంసమర్దియు నోడెన్

క. కావున మన మిఁక ననికిం
బోవం బని లేదు విపినభూమికిఁ జనియు
చ్చో వెలుపుదక్క తపసుల
మై విచ్చలవిడిఁ జరింత మందఱము దగన్

క. కాదేని బిరుదులాడక
సాదులమై వినయ మొప్పఁ జని కురునాథుం
డేది పనిచినను జేసి త
దాదృష్టి నతండు సూచున ట్లుండఁ దగున్.

ఉ. నీతెఱఁ గిట్టిదేని రణనిష్ఠురుఁ బూనక కార్యవాదివై
ద్వైతవనంబునందు సముదగ్రభుజాబలదుర్జయుండు రా
ధాత్మజయుండు వాని ననిఁ దాఁక నశక్యము కాదు నన్న నే
నీతెరు వేలపట్టి మహి నేల నశక్తుఁడు కాంతుఁ జేయునే?

తే. అని వధించెదఁ గర్ణు నేనని ప్రతిజ్ఞ
సేసి యిటు దెచ్చి కన్నిట్లు సేసి తింత
కెట్లు నేర్చితి పాడవుగా నిత్తి నేల
దైవ నోర్చితి ననుఁ బగవారినడుమ.



గాండీవ మొరుల కిమ్మని పలికిన వానిం దెగనేయుటకర్జునుఁడు ప్రతినపట్టియుండుటం జేసి యట్లు పలికిన ధర్మజుని వధించి యతఁడు సత్యప్రతిజ్ఞుఁ డగుట కురంకించెను. అయినను సమయోచితముగ ధర్మశాస్త్రము నుపన్యసించి కాపాడఁగలిగిన కృష్ణుఁడు పాండవపక్షమున నుండఁగా వారి కెట్టు లట్టియాపద వాటిల్లును?

---

క. విను మప్పలుకులు పాటిగఁ
గొని దుర్యోధనునితోడఁ గొంటిని బగ ము
న్ను నిజంబుగ నెఱుఁగను వీఁ
డని రాధేయునకు వెఱచు ననియే నిన్నున్.

చ. హరిగ బలంగ నేటికి భయంబున వచ్చితి నీదు గాండివం
బెరవుగ నిచ్చి నీవు నొగ లెక్కు హరిన్ రథిఁ జేయఁగన్న ని
ష్ఠురభుజవిక్రమోగ్రుఁ డగు సూతతనూభవుఁ దత్సహాయులం
బోరఁ గొనఁడే సుయోధనుని బోఁడిమి మూలఁగ నొక్కమాత్రలోన్

ఆ. గొంతి కడుపునందుఁ గొడుకుఁ జాలై నీవు
దోఁపమండవైతి దోఁచినట్టి
పండమెడలి ధైనఁ బిదప దిగంబడ
దయ్యె నింతపుట్ట దట్టులైన.

(భార. కర్ణ. ప. అ. ౧౩. మొ.)

*శ్లో. రక్తోత్ఫుల్లవిశాలలోలనయనః కంపోత్తరాంగో ముహు
ర్ముక్త్వా కర్ణమపేక్షితే ధృతధనుర్బాణోహరేః పశ్యతః,
ఆధ్మాతః కటుభి స్త్రిభిః స్వయమసకృద్ద్రోహక్రమం కీర్తయ
న్నంసాస్ఫోటపటు ర్యుధిష్ఠిర మసౌ హంతుం ప్రవిష్టోఽర్జునః.

(కర్ణపరాక్రమము)

"ఓయీ యర్జునుఁడా! నీవా ప్రతిజ్ఞ యజ్ఞానదశలోఁ బట్టి యుండుటచే నది నెఱవేర్పకుండుట తప్పు కాదు. మఱియు ధర్మ సూక్ష్మము నరయఁగాఁ గొన్ని చేయవలసినట్లు యుండి యకార్యము లగును. కొన్ని యకార్యములట్లగపడి చేయఁదగినవయి యుండును. నీవిపుడు సత్యమును బాలించి యహింసను బాలింప నక్కఱలేదా? అందును జ్యేష్ఠభ్రాతయు రాజును ధర్మాత్ముఁడును నగునిమ్మహాత్ముని వధించుట యెట్టి యధర్మమో యాలోచింపుము. ప్రాణహాని సర్వస్వహాని మొదలగునాపదలు సంభవించు నపుడు సత్యపరిత్యాగము దుష్టము కానేరదు. కావున ధర్మేతర మును, క్రూరమును నగునీహింసనుండి మరలుము. నీప్రతిజ్ఞకు భంగము లేకుండ ధర్మజు నిట్టివాఁడ వనిపలుకుము. అయ్యది యాతనిఁ జంపుటతో సమానమే కాఁగలదు." అని యిట్లు కృష్ణుఁ డర్జునునకు బోధఁజేసి ధర్మజుని గాపాడెను.

---

*క. సత్యంబు నహింసయు నను, నత్యుత్తమధర్మయుగళ మందు నహింసక్
సత్యము గాఁచుట ధర్మము, సత్యమున నహింసఁ గావఁ జను నండ్రు బుధుల్

ఆ. కర్మసూక్ష్మ భంగి గానక యిమ్మెయి, సత్యరక్షణంబు సలుపఁ బూనె
భ్రాత ధర్మపరుఁడు రాజిమ్మహాత్ముఁ జంపఁగ దలఁచుట ధర్మపథము గాదు

క. విను పిన్నవాఁడవు నీవు, యనుచిత మగు వ్రతము పట్టి తద్గాకయు బె
ట్టనృతము సూనృతమును నీ, కనియెడు చందంబు బుధులు గయికొనరందుర్

వ. అది యెట్లంటేని.

ఆ. ప్రాణహాని వచ్చుపట్టున సర్వధ, నాపహార వేళ యందు నడపు
సత్య మనృతమం డ్రసత్యంబు సూనృత, మని పరిగ్రహింతు రార్యజనులు.



అర్జునుఁ డందులకు సమ్మతించి "ఓయీ! జూదరీ! నీవల్లనే కదా మాకందఱకు నిట్టియాపదలు సంభవించినవి. నీదుర్వ్యసనమే కదా యిమ్మహాయుద్ధమునకు మూలమయ్యెను. పలుమాఱు రణభూమినుండి పాఱిన పిఱికిపందవగు నీవీరీతిని నన్ను నిరసింపవలయునా?" అని యీరీతిని ధర్మరాజు నెత్తిపొడిచి యవమానించెను.

పిదపఁ బూజ్యుఁడగు జ్యేష్ఠభ్రాతనట్లవమానించినందులకుఁ బ్రాయశ్చిత్తము దనతలనఱికికొనుటయే యని నిశ్చయించుకొని యట్టి పని కుద్యమించుచుండ శ్రీకృష్ణుఁడు వారించి "ఓయీ! యాత్మస్తుతిచేసికొనుట మరణమువంటిదే కాన నిన్ను నీవు పొగడికొనుము. అదియె నీచేసిన దోషమునకుఁ బ్రాయశ్చిత్తము కాఁగలదు" అని యుపదేశించెను. అర్జునుఁడును నందులకు సమ్మతించి తాను జేసిన దిగ్విజయము కాలకేయాదివిజయము మొదలగు మహాకార్యములను జెప్పి పొగడికొనెను.

అర్జునుఁడట్లు తన్ను నిరాకరించి యాతనిం బొగడికొనుటను జూచి యతఁ డుగ్గడించిన తన లోపములకు లజ్జించి ధర్మరాజు "అర్జునా! నీవుపలికినట్లు నేను నిజముగా దుష్టుఁడను, జూదరిని, పిఱికిపందను. నన్ను నీవు వధించుటయె లెస్స. నీవు దయఁదలఁచి విడిచినను నేనిఁక నిట నిలిచి యుండనోపను. నీవు చెప్పినయట్టి

---

క. నీవిట్టివాఁడవని ధర, ణీవిభునిం బలుకు మదియ నీచంపుట సం
భావించి పిదపఁ బ్రణతుఁడ, వై వినయము సేయు చిత్తమలర నతనికిన్.
(భార. కర్ణ. 3. ఆ. 73. ప. మొ.)

దుర్గుణములు గలనేను రాజ్యార్హుఁడను గాను. యుద్ధమునందు జయముగల్గెనేని భీమునకుఁ బట్టాభిషేకముచేయుము. ఇదె నే నడవికిం బోవుచున్నాఁడ." అని పలికి యరణ్యగమనమున కుద్యుక్తుఁ డాయెను.

అట్టిసమయమున శ్రీకృష్ణుఁడు ధర్మజునిపాదములపైఁ బడి యర్జునునకుఁ బ్రతిజ్ఞాభంగము గలుగకుండుటకై తానట్లు నియోగించుటచే నతఁడట్లు పలికెననియు క్షమింపవలెననియుఁ బ్రార్థించి యాతని కలంకను దీర్చెను.

ఈకర్ణాటకలహమువలనఁ బాండవులకు మఱేమియు నష్టము లేకపోయెను. సరేకదా! యిది యర్జునునకుఁ గన్నుల నిండఁ గోపము వచ్చుటకును, దెంపుచేసి యుద్ధములోఁ దలపడు మహోత్సాహము గల్గుటకును బీజమయ్యెను. ఈ రీతిని బరిభవమందిన వెనుకఁ బౌరుషశాలియగు నర్జునుఁడు కర్ణునిజంపక యుద్ధభూమినుండి మరలి వచ్చి ధర్మరాజుమోము నెట్లు చూడఁగల్గును? చేతనయినఁ గర్ణుని జంపవలయు లేకున్నఁ దాఁ జావవలయు.

పయిరీతిని గర్ణవధకు మహోత్సాహముతో సిద్ధపడి సేద దేఱియున్న యర్జునుని నంతవఱకు నోడలెఱుంగక పాండవపక్షయోధుల నందఱ నోర్చి శత్రుసైన్యముల మాన్చి యలసి యలసి యున్నకర్ణునిమీఁదికి శ్రీకృష్ణుఁడు తోడ్కొనిపోయెను.

అట్లు మిక్కిలి చొరవచేసి వచ్చుచున్న యర్జును నుత్సాహముం గనుపెట్టి భీముఁడు దుశ్శాసనుపైఁ దలపడి వానినో



డించి రాక్షసావేశమున గుండెలపైఁ గూరుచుండి వానిరక్తమును ద్రావ నారంభించెను. అట్టి క్రూరకృత్యము నొనరించుచున్న భీమునిమీఁది కెవ్వరును రాకుండ నర్జునుఁడు కాపాడఁ జొచ్చెను. ఆవఱ కతిఘోరముగా విక్రమించి పరిశ్రాంతుఁడయి యుండుటచేఁ గర్ణుఁడు, నర్జునరక్షితుఁడును, రౌద్రావేశదుర్నిరీక్ష్యుండును నగు భీమసేనుని జెనక రాఁజాలక నిశ్చేష్టితుఁ డయి యూరకుండెను.

అట్టిసమయమున మహావీరుఁ డగుకర్ణుని కుమారుఁడు వృషసేనుఁడు తెంపుచేసి భీమునిపై కురవడింపఁగా నాతనిపై కర్జునప్రభృతియోధవరులెల్లఁ దలపడిరి. అయినను జలింపకవృషసేనుఁడు మహోత్సాహముతో మిన్నును మన్నుంగానక వారి నెల్లఁ దానొకరుఁడె యెదిరించి బాణపరంపరలచే నొప్పించెను. అందు నకులుఁడు తన్నెదుర్కొన నతని విరథునిజేసి పీడింపఁగా నాతఁడు భీమునిరథముపైకిఁ బాఱిపోయెను. అయిన విడువక వృషసేనుఁడు భీమనకులుల నిద్దఱను దలపడి నొప్పించుచుండఁగా వారు చలించి వృషసేనుని దాడి కోడి యర్జును నుపలక్షించి "అర్జునా! వీని నుపేక్షించెద వేల? మమ్మునెట్లు పీడించుచున్నవాఁడో చూడుము" అని పలికిరి. తనకన్నుల యెదుట నవారణవిక్రమంబున భీమనకులులనుజయించి* విజృంభించుచున్న వృషసేనుని

---

*శ్లో. అథా బ్రవీ న్మారుతిః ఫాల్గునం చ, పశ్య స్వేనం నకులంపీడ్యమానం,
అయం చ నో బాధతే కర్ణపుత్రః, తస్మాద్భవా న్ప్రత్యుపయాతు కార్ణిం)
(భార. కర్ణ. 82. అధ్యా. 42. శ్లో.

సహింపఁజాలక క్రోధముతో నర్జునుఁ డాతని నెదుర్కొనెను. వృషసేనుఁడును జూపరు లత్యాశ్చర్యము నొందునట్లుగ నర్జునునితో ఘోరయుద్ధము చేసి వీరస్వర్గము నొందెను.

యువరాజగు దుశ్శాసనుఁడు తనకన్నులయెదుట భీమునిచే నారీతి నతిఘోరమగు దుర్మరణమునందుటయు మహావీరుఁడగు తనపుత్రుఁ డర్జుననిచేఁ జచ్చుటయుం జూచి తానలసియున్నను నట్టిపరాభవమును సహింపఁజాలక శోకాతిరేకమున ద్విగుణితమగు రౌద్రావేశముతో నొడలు తెలియని తమకమునఁ గర్ణుఁ డర్జునుం దలపడెను.

అప్పుడు కల్పాంతప్రచండమార్తాండులవలెఁ బ్రకాశించు నయ్యిరువుర ద్వంద్వయుద్ధమును జూచుటకు వచ్చిన సురగణముల విమానము లాకాశమున సాంద్రము లయ్యెను. కర్ణార్జునులలో నెవ్వరికి జయము గలుగఁగలదో యని సందేహ మాదేవసభ కంకురించెను. అర్జునపక్షపాతియగు నింద్రుఁ డట్టి సమయమున నీశ్వరుని దేవతలను నుపసర్పించి వారందఱిచే నేకవాక్యముగ నర్జునునకు జయముగలుగునట్లుగ దీవింపించెను.

కర్ణార్జునులు ద్వంద్వయుద్ధమున నారంభించి శరలాఘవ మేర్పడునట్లుగ నన్యోన్యపరిహారార్థము ప్రయోగించుకొనిన బాణపరంపరలచే రోదోంతరమును గప్పుచు నాగ్నేయవారుణ

శ్లో. నకులమథ విదిత్వా ఛిన్నబాణాసనాసిం,
విరథ మరిశరార్తం కర్ణపుత్రాస్త్రభగ్నమ్.
(భార., కర్ణ 36 అధ్యాయము: శ్లో.)



పర్జన్యవాయవ్యాదిదివ్యాస్త్రముల నొండొండఁ బ్రయోగించుకొనుచు నాకాశమున సురగణంబులును భూమిపయిని యోధవరులును నత్యాశ్చర్యమున నిర్నిమేషముగాఁ జూచుచుండ లోకములు చలించునట్లుగ నభూతపూర్వమగు ద్వంద్వయుద్ధమును జరపిరి. అందర్జునుఁ డైంద్రాస్త్రప్రయోగమునఁ గర్ణుని నొప్పింపఁగా దానికిఁ బ్రతిగా నాతఁ డమోఘమగు భార్గవాస్త్రమును బ్రయోగించెను. అయ్యదియైంద్రాస్త్రము నడంచుటయే కాక యర్జునుని బాండవబలంబును మర్దించుచుండఁగా నర్జునుఁడు చేయునదిలేక నిశ్చేష్టితుఁడయ్యెను. అట్టియెడఁ గౌరవు లతిహర్షముతోఁ గృష్ణార్జునులను మృతప్రాయులనుగాఁ దలంచి సింహనాదములను జేసిరి. భీముఁడు చేయి విదిర్చుకొనుచు నర్జును ననేకవిధములఁ బ్రశంసించి యుత్సాహమును బుట్టించుచు "ఓయీ యర్జునా! దివ్యాస్త్రవేదివగు నీవిట్లూరకుండఁ జనునా? ఇది వెనుదీయు కాలమా? కౌరవు లతిహర్షముతో సింహనాదములను జేయుచున్నారు. దురాత్ముఁడగు కర్ణుఁడు మనబలంబుల నెల్ల మర్దించుచున్నవాఁడు. దేవతలకు నసాధ్యులగు కాలకేయాదుల జయించిన నీకు వీఁడన నెంతవాఁడు. లెమ్ము. ఉత్సహింపుము. వీని వధింపుము" అని తెలివొందించెను. శ్రీకృష్ణుఁడును నట్లె యర్జునుని కుత్సాహకరముగఁ బ్రసంగించి యేధైర్యముతో నాఁడు నీవు మాయాకిరాతుండగు రుద్రుని సంతోషింపఁజేసితివో యాధృతి నవలంబించి కర్ణు నెదిరించి బ్రహ్మాస్త్రప్రయోగమున వీనియస్త్రమును శాంతినొందింపుమనియుపదేశిం

చెను. అర్జునుఁ డప్పు డాయుపదేశము చొప్పున బ్రహ్మాస్త్రమును బ్రయోగించి కర్ణుని భార్గవాస్త్రము నుపశమింపఁ జేసెను.

---

*శ్లో. "ధృఢజ్యమానస్య సముద్రఘోషం ప్రాదుశ్చక్రే భార్గవాస్త్రం మహాత్మా, మహేంద్రశస్త్రాభిముఖాన్ వియుక్తాన్ ధిత్వా కర్ణః పాండవస్యేషుసంఘాన్. తస్యాస్త్ర మస్త్రేణ నిహత్య సోఽథ జఘాన సంఖ్యే రథనాగపత్తీన్......పాంచాలానాం ప్రవరాన్ సన్నిపాత్య ప్రసహ్య, యోధావశీలాన్,......తతస్స రాజన్ విరరాజ కర్ణో యథాంబరే భాస్కర ఉగ్రరశ్మిః, కర్ణస్య మత్వాతు జయం త్వపి సూనః పరాం ముదం సింహనాదాం శ్చ చక్రుః, సర్వే హ్యమన్యంత భృశాహతౌ చ కర్ణేన కృష్ణావితి కౌరవేంద్రాః......తత్తాదృశం ప్రేక్ష్య మహారథస్య కర్ణస్య వీర్యం......వాతాత్మజః పాణినా పాణిమార్చ్ఛన్ భీమోఽబ్రవీ దర్జునం సత్యసంధం, అమర్షితో నిశ్వస్య జాతమన్యుః కథం ను పాపో యమపేతధర్మః, సూతాత్మజః సమరేఽద్య ప్రసహ్య పాంచాలానాం యోధముఖ్యా ననేకాన్, నిజఘ్నివాం స్తవ జిష్ణో స్సమక్షం పూర్వం దేవై రజితం కాలకేయైః, సాక్షాత్ స్థాణోర్బాహుసంస్పర్శ మేత్య, కథం ను సత్వాం సూతపుత్రః కిరీటిన్, రథేషుభిర్దశభిః ప్రాగవిధ్యత్, త్వయా క్షిప్తాం శ్చాగ్రసద్బాణసంఘాన్, ఆశ్చర్య మేత త్ప్రతిభాతి మేఽద్య, కృష్ణాపరిక్లేశ మనుస్మరత్వం, యథాఽబ్రవీత్ షండతిలాన్ స్మ వాచః, రూక్షాన్ సుతీక్ష్ణాం, శ్చ హి పాపబుద్ధిః, సూతాత్మజోఽయం గతభీర్దురాత్మా సంస్మృత్య సర్వం తదిహాద్య పాపం, జహ్యాశు కర్ణం యుధి సవ్యసాచిన్, కస్మాదుపేక్షాం కురుషే కిరీటిన్, ఉపేక్షితుం నాయ మిహాద్య కాలః, యయా ధృత్యా సర్వభూతా న్యజైషీత్, గ్రాసం దదత్ ఖాండవే పావకాయ, తయా ధృత్యా సూతపుత్రం జహి త్వం, అహం చైనం గదయా యోధయిష్యే, అథాబ్రవీ ద్వాసుదేవోఽపి పార్థం, దృష్ట్వా రథేషూన్ ప్రతిహన్యమానాన్... ...సవీరహా ముహ్యసి నావధత్సే, నదం త్యేతే కురవ స్సంప్రహృష్టాః... కిరాతరూపీ భగవాన్ సుధృత్యా యయా మహాత్మా పరితోషితోఽభూత్



ఈ యరీతి ననేకదివ్యాస్త్రములు తొండొరులఁ బ్రయోగించుకొనుచు నొక్కరును వెనుదీయక పోరుసమయమున ఖాండవదహనకాలమున నర్జునునిపైఁ బగఁబట్టి సర్పముఖాకారశరరూపమునఁ గర్ణు నాశ్రయించి యున్న యశ్వసేనుఁ డను నాగకుమారుని దీసి కర్ణుఁ డర్జునునిపైఁ బ్రయోగించుటకు గుఱిపట్టెను. అప్పుడు శల్యుఁడు గ్రహించి యర్జునసంరక్షణార్థియై లక్ష్యచలనము గలుగునట్లుగ "కర్ణుఁడా! కంఠమునకు సరిగా గుఱిపట్టలేదు. మరలించి సరిగాఁ బట్టుము" అని పల్కెను. "కర్ణుఁడు రెండుమాఱు లొక శరమును గుఱిపట్టునా? కర్ణునకును గుఱిపట్టుట నుపదేశించునంతటివాఁడవా నీవు"! అని పలికి కర్ణుఁ డహంకారముతోఁ బ్రయోగించెను. అప్పటి కాగుఱి యర్జునుని ఫాలమునకు సరిగా నుండెను. మంటలను గ్రక్కుచువచ్చుచున్న యమోఘమగు నాసర్పముఖశరముం గని దానిచే నర్జునుఁడు చచ్చునని తలఁచి లోకేశ్వరుఁడగు శ్రీకృష్ణుఁడు రథము భూమిలోఁ గూరుకొని పోవునట్లుగఁ బాదములతో నడంచెను. అక్కారణంబున నాసర్పముఖశర మర్జునుశిరమునకు మీఁదయి యాతనిం దెగటార్పఁ జాలక యాతని కిరీటము మాత్ర మూడఁగొట్టెను. అయినను నాయశ్వసేనుఁడు మరలఁ గర్ణునొద్దకు వచ్చి "ఓయీ కర్ణుఁడా!

---

తాం త్వం పున ర్వీరధృతిం గృహీత్వా, మహానుబంధం జహి సూతపుత్రమ్" అని యిట్టి త్యధికముగ సంస్కృత భారతమున నగపడుచున్నది. విస్తరభీతి నుదాహరింపలేదు. ఈవిషయ మాంధ్రభారతమున సరిగా లేదు. ఈసందర్భమునఁ బంకమగ్నమగు వృషభమును లేవఁజేసినట్లుగ నర్జునుని భీమజనార్దనులు లేవఁజేసినట్లున్నది.

నీవు సరిగా గుఱిపట్టక నన్నుం బ్రయోగించినందున నే నర్జునుం దెగటార్పం జాలనయితిని. కావున మరల జాగ్రత్తతో నన్నుం బ్రయోగింపుము. వజ్రధరుండగు నింద్రుండు వచ్చి కాపాడినను విడువక యర్జునుని వధించెదను." అని పలికెనుగాని కర్ణుం డందులకు సమ్మతింపక "కర్ణుం డొక బాణమును రెండుమాఱు లుపయోగించునా? మఱియుం గర్ణుండు పరులబలము నాధారముగాం జేసికొని యర్జును జయింపం గోరునా? పొమ్ము" అనిపలికెను. కాల మాసన్నమయియుండుటచేం గావలయుం గర్ణుం డర్జునుని వలె జయార్థులు చేయందగినవ్యాపారములను జేయక కేవలము దనకీర్తిశరీరరక్షణమునకే యత్నించుచు వచ్చెను.

పయిరీతిని బెద్దయుంబ్రొద్దుమహాద్భుతమగు ద్వంద్వయుద్ధము జరుపంబడెను. తుదకుం గర్ణునకుం గాల మాసన్నమగు

*"తం ప్రేక్ష్య విప్లుతం యుద్ధ మాధవస్తు
త్వరాన్విత స్త్వరాయైవ లీలయా,
పదాతి నిష్పిష్య రథోత్తమంస
ప్రావేశయ త్పృథివీం కించి దేవ......
సంధీయమానం భుజగం దృష్ట్వా కర్ణేవ మాధవః,
ఆక్రమత్ స్యందనం పద్భ్యాం బలేన బలినాం వరః.
అవగాఢేంగథే భూమౌ జానుభ్యా మగమ న్హయాః.....
న నాగకర్ణోఽద్య రణే పరస్య బలం సమాస్థాయ జయం బుభూషేత్,
న సందధ్యాం ద్విః శరం చైవ నాగయ ద్యర్జునానాం శతమేవహన్యాం.'
(భార. కర్ణ. 91. అధ్యాయము.)

ఈవిషయము మాంధ్రభారతమున నగపడదు



టచేం బరశురామభూసురశాపంబులు సఫలంబులు కాందొడంగెను. అట్టియెడం గర్ణుండు, నిత్యసత్యవ్రతుండును, ధర్మాత్ముండు నగు తనకట్టియాపద సంభవించుట కాశ్చర్యపడుచు ధర్మమును దూఱసాగెను.

తే. ధర్మవాదులు ధర్మతత్త్వప్రధాన
చిత్తు లగువారిం బూని రక్షించు ధర్మ
మందు రది బొంకు గాపించె నతులధర్మ
శీలుం డగు నన్ను ధర్మువు సెలవు లేదొ?

అర్జునువధించెద ననితాను జేసిన ప్రతిజ్ఞను నెఱవేర్పంజాలు సర్పముఖశరంబును, నింద్రదత్త శక్తియుం బయిరీతిని వ్యయపడుటయుం దానర్జునుపయిం బ్రయోగించిన బ్రహ్మాస్త్రము నర్జునుండును దానిచేతనయ యుపశమింపంజేయుటయుం దనయంత్యకాలమును సూచించు భార్గవభూసురశాపములు పయిరీతిని దొడరుటయుం దలంచి మిక్కిలి కోపించి యుడికిన మనంబున ధైర్యము చిక్కంబట్టి యుత్సాహమును దెచ్చికొని శరలాఘవ మేర్పడ నర్జునుని వింటినారిని వరుస నెన్నో మాఱులు ఖండించి విజృంభించెను.* కర్ణుండు నారుల నెన్నిటిం దునిమినను నతివేగమున ధనువును

*"తతః కర్ణః శితై ర్బాణై ర్జ్యాం చిచ్ఛేద సుతేజనైః,
ద్వితీయాం చ తృతీయాం చ చతుర్థీం పంచమీం తథా.
షష్ఠీమథాస్య చిచ్ఛేద సప్తమీం చ తథాష్టమీం,
నవమీం దశమీం చాస్య తథైవైకాదశీం వృషః.
జ్యాశతం శతసంధానః సకర్ణో నావబుధ్యతే."
[భార. కర్ణ. 91. అధ్యాయము.]

సజ్యముగఁ జేసికొనుచు నర్జునుఁడు మాటేయఁ బోవుచుండెను గాని కర్ణుఁ డల్లెడ లేకుండునట్లుగ నారిని భేదించుచువచ్చెను. తుదకెట్టకేటో నారిని దగిలించి మహారోషమున నర్జునుఁడు కర్ణునిపై బాణవర్షమును గురిపించెను. అందులకుఁ గర్ణుఁడు మిగులఁ గోపించి విషము గ్రక్కుచున్న యొకక్రూరమగు నారసమును సంధించి దానిని రౌద్రమంత్రసహితంబుసేసి ప్రయోగింపఁ బోవునప్పు డంతకుముందె కొంచెము క్రుంగియున్న రథముచక్రము బొత్తిగాఁ గ్రుంగి బాణప్రయోగము చేయుటకు వీలుపడకుండునట్లుగ రథము ఘూర్ణిల్లెను. సమయము చూచుకొని రథముదిగి కర్ణుఁడు భుజమున నూని రథచక్రమును లేవనెత్తఁగా సప్తద్వీపములు గలభూమియంతయు సముద్రపర్వతాటవులతో నాలుగంగుళములు మీఁదికి లేచి పోయెను గాని రథచక్రమును మాత్రము కఱచిపట్టియే యుండెను.* అట్టియెడఁ గర్ణుఁడు యుద్ధసంరంభముతో నున్నయర్జును వీక్షించి "ఓయీ! అర్జునుఁడా! క్షణమాత్రము యుద్ధము నిలుపుము. దైవవశమున భూగ్రస్తమగునారథచక్రమును భూమినుండి పెల్లగించుటకు రథమును దిగియెదను. నేను మరలసన్నద్ధుఁడనగువఱకు నీవేయకుండుట యుచితము. యుద్ధధర్మమును వెల్లడించితిని గాని నీకును గృష్ణునకును వెఱచి యిట్లు పలికినవాఁడను గాను. భూమిపై నుండు నన్ను రథస్థుఁడవై కొట్టుట యనర్హము. కావున నిన్ను క్షణమాత్రము నిలుమని కోరితిని. ఈపరాభవము నాకు మాతృగురుప్రభృతులచేఁ జేయఁబడెను గాని నీచేతఁ గాదు. కావున నీవు వృథాభిమానము నొందకుము" అని యిట్లు పలికెను. అపుడు శ్రీకృష్ణుఁడు "కర్ణుఁడా! నీ కిప్పుడు నీతియు ధర్మమును గావలసివచ్చినవా? పాండవులను లక్కయిండ్లలో దింపి కాల్పించునప్పుడును, ద్రౌపదిని సభలో నావిధముగ భంగపఱచినప్పుడును, నడవిలో దైన్యముతో నున్న పాండవుల నుడికించుటకై దుర్యోధనునిచే ఘోషయాత్ర చేయించునప్పుడును, బాలుఁడగు నభిమన్యు నొక్కరు ననేకులు గలసి వంచనచేసి చంపునప్పుడును నీ శ్రీరంగనీతు లెట కేఁగినవో తెలియరాకున్నది." అని యిట్లు ఘాటించి యర్జునునకు రోషమును గెరలించి "అర్జునా! సంశయింపక వీనితలఁ దెగవేయుము" అనిపలికెను. కృష్ణునిమా

*"తతోఽవతీర్య రాధేయో రథా దాశు సముద్యతః,
చక్రం భుజాభ్యా మాలంబ్య సముత్క్షేప్తు మియేష సః.
సప్తద్వీపా వసుమతీ సశైలవనకాననా,
గీర్ణచక్రా సముత్క్షిప్తా కర్ణేన చతురంగుళమ్."
(భార. కర్ణ. 91 అధ్యాయము.)



*"భోభోః పార్థ మహేష్వాస ముహూర్తం పరిపాలయ,
యావచ్చక్ర మిదం గ్రస్త ముద్ధరామి ధరాతలాత్.
పార్థ కాపురుషాచీర్ణ మభిసంధిం విసర్జయ...
న మాం రథస్థో భూమిష్ఠం వికలం హంతు మర్హసి,
న వాసుదేవా త్త్వత్తో వా పాండవేయ బిభే మ్యహం.
పరాభవో మాతృగురుద్విజేభ్యః
సముద్రపర్యంకధరా మహేంద్రైః,
కృతో మమాయం న హి న స్త్వయాకృతో
న తేఽభిమానం భవితా చ నో ధ్రువమ్.
(భార. కర్ణ. 91. అధ్యాయము.)

టలచొప్పిన యుద్ధమునుండి మరలకయున్న యర్జునునిపైఁ గోపించి కర్ణుఁడు రథస్థుఁడై యమదండమువంటి యొక ఘోరమగు బాణమును బ్రయోగించెను. అద్దానిచే హృదయమున వేధింపఁబడి యర్జునుఁడు మిగుల నొచ్చి రథముపై మూర్ఛిల్లెను. అది సందుచేసికొని కర్ణుఁడు రథమునుండి దిగి చక్రము నెత్తఁబోయెను గాని యయ్యది లేవకుండెను. అంతలో నర్జునుఁడు తెలివొంది కాలదండమువంటి శాణమును సంధించి సన్నద్ధుఁడై యుండఁగా శ్రీకృష్ణుఁడు "ఓయీ! యర్జునుఁడా! సందేహించెదవేల? ఈదుష్టుఁడు రథారోహణముచేయకముందే యీవాఁడి నారసమున వీనిని వధింపుము" అని పలికెను. అర్జునుఁడును గృష్ణుని వాక్యమును శిరసావహించి యాబాణమును బ్రయోగింపఁగా నక్కర్ణుఁడు దానిచే హతుఁడయ్యెను.

---

ఏవముక్త స్తతః కర్ణో వాసుదేవేన భారత,
క్రోధాత్ప్రస్ఫురమాణౌష్ఠో ధనురుద్యమ్య భారత!.
యోధయామాస నై పార్థం మహావేగపరాక్రమః,
తత శ్శరం మహాఘోరం జ్వలంత మివ పావకమ్,
ఆదదే పాండుపుత్రస్య సూతపుత్రో జిఘాంసయా.
ససాయకః కర్ణభుజప్రయుక్తః
సకాశనిప్రఖ్యరుచిశ్శితాగ్రః,
భుజాంతరం ప్రాప్య ధనంజయస్య
వివేశ వల్మీక మివోరగోత్తమః.
సగాఢ విద్ధ స్సమరే మహాత్మా
విఘూర్ణమానః శ్లథహస్తగాండివః,



చచాల బీభత్సు రమిత్రమర్దనః
క్షితేః ప్రకంపే చ యథాఽచలోత్తమః.
తదంతరం ప్రాప్య వృషో మహారథో
రథాంగ ముర్వీగత ముజ్జిహీర్షుః,
రథాదవప్లుత్య నిగృహ్య దోర్భ్యాం
శశాక దైవాన్న మహాబలోఽపి.
తతః కిరీటీ ప్రతిలబ్ధసంజ్ఞాం
జగ్రాహ బాణం యమదండకల్పం,
భయంకరం ప్రాంజలికం మహాత్మా
తతోఽబ్రవీ ద్వాసుదేవోఽపి పార్థం.
ఛింధ్యస్య మూర్ధాన మరే శ్శరేణ
నయావదారోహతి వై రథం వృషః,
తథైవ సంపూజ్య సతద్వచః ప్రభోః......
తతోఽర్జున స్తస్య శిరో జహార
వృత్రస్య వజ్రేణ యథామ హేంద్రః.

(భారత. కర్ణపర్వ. 92. అధ్యాయము.)

పైవిషయము లాంధ్రభారతమున సరిగా వ్రాయఁబడలేదు. భూమిష్ఠుఁడైనకర్ణు నర్జునుఁడు వధించినట్లు చెప్పలేదు.

---

---

ఉపసంహారము.-హృదయభేదకరమగు పాండవుల దుఃఖాతిశయము.

కర్ణుఁ డజయ్యవిక్రముఁ డనియు, దైవదుర్విపాకంబునను నర్జునునకుఁ గల శ్రీకృష్ణభగవానుల సాహాయ్యమునను నాతఁ డర్జునునకు వధ్యుఁ డయ్యె ననియుఁ జెప్పుట సాహసము కాదు.

---

*"క. భువనము లన్నియు నొక్కటఁ
గవిసియుఁ గర్ణుఁ బరిమార్పఁగా నోపునె భూ
ధవ! భవదీయక్రోధా
గ్నివిహతుఁడై క్రాఁగెఁ గాక నిక్కం బరయన్

(భార. కర్ణ. 3. ఆ. 387 ప.)

చ. వినుము నరేంద్ర! విప్రుఁ డలివేళ జమదగ్నిసుతుండు శాపమి
చ్చె నమరభర్త వంచనము చేసె వరం బని కోరె కుంతి మా
న్చె నలుక భీష్ముఁ డర్ధరథుఁ జేసి యడంచెఁ గలంచె మద్రరా
జనుచితమాడి శౌరి విధియయ్యె నరుం డనఁ జంపెఁ గర్ణునిన్.

(భార. శాంతి. ఆ. ౨౫. ప.)

క. గురుకర్ణులయస్త్రాగ్నుల
నెరసినయది మున్ను దీని నిటు గాకుండన్
భరపడి రక్షించితి సం
గరము తెగిసఁ దొలఁగి యిపుడు గాల విడిచితిన్

(కర్ణ. 3. ఆ. 387.)



ఘోరయుద్ధమునందు బంధుమిత్రులను జంపితి మ్మని మనమునఁ బరితపించుచున్న ధర్మరాజాదులకుఁ గౌరవవిజయానంతరమున బంధుల కుదకదానము చేయునప్పుడు కర్ణుఁడు తనకు జ్యేష్ఠపుత్రుఁ డనియు నాతని కుదకదానము చేయ వలయు ననియుఁ గుంతి తెలియఁజెప్పెను. పిడుగువలె వినఁబడినకఠోరమగు నావృత్తాంతమును విని ధర్మరాజు దుఃఖసముద్రమున మునిఁగి పరిపరివిధములఁ బరితపించుచు నెంద ఱెన్నివిధముల నూరార్చినను నూఱడిల్లక తల్లిం దూఱుచు స్త్రీలకు రహస్యరక్షణసామర్థ్యము లేకుండునట్లు శపించి తాఁ జేసిన యకార్యమునకుఁ బశ్చాత్తాపపడి రాజ్యాభిషేకమున కియ్యకొనక వగలం బొగులసాగెను.

---

*వ. అక్కౌంతేయులు వారు ధర్మంబు దొరంగి గాంగేయద్రోణకర్ణదుర్యోధనాదుల వధించుట యత్తఱిఁ గ్రొత్తయై తోఁచనఁ జిత్తంబుల వగయు లజ్జయు మిగులం బొడమ మొగంబులం దోఁప విన్ననై యున్నం జూచి వెన్నుండు తత్సమీపంబునకుఁ జని వారలతో నిట్లనియె.

సీ. గాంగేయగురుకర్ణకౌరవపతులఁ జ
క్కటి ననిఁ బరిమార్పఁ గానమైతి
మని మీరు వగవకుఁ డద్దొర లుగ్రాస్త్ర
వేదులు ప్రస్ఫుటవిక్రమమున
నదరి వారలఁ గెల్వ నరిది గావున నేను
బహువిధోపాయముల్ పన్ని యిట్లు
తీర్చితిఁ గాక యత్తీవ్రపరాక్రము
లలఁతులఁ బోదురె యట్లు గాక..."

(శల్య. 7. ఆ. 330.331 ప.)

జ్యేష్ఠభ్రాతయు సత్యసంధుఁడును దల్లిచే నన్యాయముగ విట్టియాపదలనందినవాఁడును వాత్సల్యమునఁ దమ్ముఁ జంపక విడిచినవాఁడును నగు పుణ్యపూరుషుని వైరి యనుకొని వంచనచేసి వధించినపిదప నాతఁడు సోదరుఁ డని తెలిసినపు డెట్టికఠినుల కైన హృదయము భేదిల్లకుండునా?

శత్రులను జయించి ధర్మరాజు రాజ్యము ననుభవించె ననుకొనుటయె కాని యేమనుభవించెను? అఖండమగుదుఃఖము ననుభవించెను! భీష్మాదికురువృద్ధులను ద్రోణాదిగురుజనంబులను నభిమన్యుప్రభృతికుమారవర్గమును విరాటద్రుపదాదిబంధుబృందంబును దక్కుంగల మిత్రరాజమండలిని పుత్రనిర్విశేషు లగు ప్రజలను దన రాజ్యభోగప్రాప్తికిఁ గదా బలివేసెను. వారిని వీరిని బలివేసె ననఁనేల? రక్తము పంచుకొని పుట్టినసహోదరుఁ డగు కర్ణుని బలివేసెను. మఱియుఁ దనతనయులను బలివేసెను. అనుజులను దనుజులను బలివేసి సంపాదించిన రక్తపుఁ గూటి కన్న నడవిలోని దుంపధూళియు నుత్కృష్టములుగదా. ఆహా! నాఁడు సంధికాలమున నీతికుశలుఁడును దూరదృష్టియు నగుసంజయుఁడు చెప్పినవాక్యములె వేదవాక్యము లయ్యెను గదా!

“చ. అఖిలజనక్షయం బయి జయాపజయంబులు రెండునుం దుదిన్
సుఖములు గా నియోపనికిఁ జొత్తురె యుత్తము లట్లుగాక య
న్నిఖిలసుఖంబు లేమిటికి నీవని వృద్ధజనంబు బాలురన్
సఖులను బంధులన్ గురులఁ జంపితయేని దయాపయోనిధీ!
[భార. ఉద్యో. 1 ఆ. 296 ప.)



రహస్యభూత మగు కర్ణుని జన్మప్రకారము [illegible] తనికి సంభవించిన నీచకులజుఁడను నపయశస్సును [illegible] లార వినినపు డాసహోదరుల కెట్లు నలుగురలో [illegible]గ మెత్త్రుకొనితిరుగ నగును! మఱియు నాతఁడు నీచకులజుఁ డని ద్రోణుఁడు బ్రహ్మాస్త్రము నుపదేశింపకుండుటయుఁ బరశురాముఁ డుపదేశించి శపించుటయు వినినపుడును, నట్టిచిక్కులలోని కర్ణుని దైన్యము ననుభావించినపుడును దత్సహోదరుల గుండియ లెట్లు వ్రీలకుండును! కుంతి కోరినప్రకారము తమ్ములను వధింపకుండుటకు వరము నొసంగి యల్లే చేపడినను జంపక విడిచిన యన్నను వైరి యనుకొని చేసేతఁ జంపికొనిన యాసోదరు లెట్లు జీవింపనోపుదురు! తమజయమున కై యింద్రుఁ డాతని వంచింపఁగా నొడలొలిచి యాతనికిఁ గవచకుండలముల నొసంగిన యాతని ధైర్యౌదార్యములను, సత్యవ్రతమును, దానశీలమును స్మరించినపుడును రాజ్యాభిషేకమును జేయించెద మని కుంతీకృష్ణులు బోధన చేసినను నట్టియనుచితకార్యమునకుఁ జొరక రాజ్యాధిపత్యమును దృణము నకైనఁ దలఁపక విడిచివేసిన యాతని ధీరోదాత్తతను నౌచిత్యము

క. పాలీక కౌరవులు దు, శ్శీలతఁ జెడఁదలఁచి రేనిఁ జెప్పెద రుధిరా
భీలాన్నంబునకంటెను, మే లగు భిక్షాన్న మైన మానదవడికిన్.
[భార. ఉద్యో.. 1. ఆ. 329]
తుదిఁబోయి క్రూరకర్మా, స్పద మగు కొఱఁగునకుఁ జొచ్చి బంధులగురులన్
వెదకి వధియించు సౌఖ్యం, బదియేటికి నాన్యనింద్య మస్థిర మగయున్
(భా. ఉద్యో.-I ఆ. 332.)

[illegible] భావింపవచ్చును రాజ్యమునకై యెన్నెన్నో యనౌచిత్యములకొడిగట్టుకొని తుదకట్టిసోదరుం జేసేతఁ జంపికొన్న యాసహోదరులచిత్తము లెట్లుదీర్ణములు కాకుండును! రాజ్యభోగముల మాట యటుండఁగాఁ బాండవులు నిజముగ దుఃఖసముద్రములో మునిఁగి భూలోకనరకము ననుభవించి బ్రతుకు భారమై కాలముం గడపికొని రని చెప్పవచ్చును.

పాపము! ఎఱిఁగియెఱిఁగి చేసేతఁ దనయుని జంపికొన్న కుంతి కిఁక "దొంగలతల్లి కేడువ సిగ్గు" అనురీతి లోలోనఁ గుల్లి కృశించుటకన్న గత్యంతర మేమున్నది?. ఆమె దౌర్భాగ్యము నేమని చెప్పవచ్చును? తన చిన్ననాఁటిరహస్యవృత్తమా దాఁగలేదు. కడుపారఁగన్నకొడుకునా చంపికొనెను. తొలుదొల్తఁ దనకన్యాత్వమునకు భంజకమయి వివాహప్రతిబంధక మగునని కర్ణజన్మవిషయకమగు నాదేవరహస్యమును వెల్లడింపదయ్యె. ఆమీఁద గర్ణుఁడు దుర్యోధనునకుఁ బ్రాణమిత్రుఁ డగుటఁజేసి తనమానమును గోలుపోయి వెల్లడించినను నాతఁడు దుర్యోధనుని విడుచువాఁడు కాకుండుటచే జ్యేష్ఠుఁడగు కర్ణుఁడు దుర్యోధనసేవకుఁడై యుండఁ గనిష్ఠులగు ధర్మరాజాదులకును నట్లు సేవకత్వము దుర్లంఘ్యమేయగు ననియు నట్లయినఁ దన్నెన్నో బాములం బెట్టినబావగారి సంతతిపైఁ బగతీఱక పోవుననియుఁ గావలయునట్టి రహస్యమును ధర్మరాజాదులకుఁ దెలుపదయ్యె. ఔరా! "స్త్రీబుద్ధిః ప్రళయాన్తికా" అనుమాట యీవిషయమున బూటకము కాదనిచెప్పక తప్పదుగదా! ఈరహస్యము



నెఱిఁగిన శ్రీకృష్ణాదులు వెల్లడింపకుండుటకు లె చాలియున్నవని చెప్పవచ్చును.

పాపమీవిషయమునఁ బాండవకుటుంబ మట్టునకు వారికే లోలోన జీర్ణింపవలసిన యవస్థ ప్రాప్తించినది. కుంతి యెఱిఁగి యెఱిఁగి చేసేతఁ జంపికొనెను. ధర్మరాజు చేపడినను దన్నుఁ జంపక విడిచిన కర్ణుని వధించుటకై యర్జునునెన్నోవిధముల నిష్ఠురములాడి ప్రేరించి యట్లు చంపించెను. అట్లే భీమనకులసహదేవులును దమ్ముఁజంపక విడిచిన యట్టియన్నను జంపుమని యర్జునునిఁ బ్రేరించిరి. అర్జునుఁడును రథస్థుఁడైయుండి యుద్ధమర్యాదను వీడి భూమిష్ఠుఁడైయున్నఁగర్ణునిఁ దాను రథ మెక్కువఱకును బాణమేయుట తగదని మొఱవెట్టుచున్న వానిని నన్యాయ్యముగ వధించెను. పైవిషయముల నెవ్వరిమనములలో వారు పశ్చాత్తాపముతో స్మరించుకొనునపు డెవ్వరికి దుఃఖాతిశయమునఁ బ్రేవులు పెల్లగిలకుండును! ఆహా! దుర్యోధనుఁడు తాను బ్రదికియుండి పాండవులను సాధించిన దంటె నెక్కుడుగాఁ జచ్చియే సాధించెను. మఱియు వారి గుండెలలోఁ జిచ్చుపెట్టి సదా రగిలించు మహాశత్రు వాఁడు నగదా!

రాజన్ ప్రెస్, రాజమండ్రి—1928

